శ్రీ ర స్తు.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

# వల్లీమల్లి.



క. శ్రీకరమై సిరులకు సీ, రాకరమై విబుధవినుత రక్షోగణధీ
భీకరమై వెలుగు లస, న్నాకరకవితాంఘ్రిదలతు మదినెల్లపుడున్.

ధరావరాంగనకు దిలకంబనందగి కలుములకుం గలిమియై
పురేందిర కావాసంబగు రాజీవంబు చందంబున నొప్పి యొందందు సుంద
రోద్యానమ్ముల యందమ్ముగన్న నగరాంగన నానాజాతి ప్రసూననిక
రమ్ముల నలంకారమొనర్చికొని నీలిల స్నిగ్ధశిరోరుహంబుల గొప్పవెట్టి
న భాగున సొంపెసలార సమున్నతసాలంబు కనకమణి విరాజితంబై
భూనితంబినీవిధృత హాంసకంబువడువున దీపింప నగాధతోయం బగుచు
ఖేయంబు రత్నాకరుండు దాపురి జేహారులచే రత్నంబులంగోల్పోయి
నిర్ధనుండై శరణాగతి వేడిన విధంబునందోప నిష్కుటంబులు శుకపిక
శారికాప్రకర కలకలధ్వాన రమ్యంబులగుచుం బురవిలాసినీ జనవిహార
మనోహరంబులై వెలయుచుండ బహువిధ మణినికర బహుప్రకాశ వి
నిర్మిత భువనాతిశయ భవనాతిదీప్త సువర్ణజాల పరిశోభిత పురరమణీ
వినిక్షిప్త భూషణబహుళ కనకమయపేటికాయమానమందిర బృందం
బులు సుందరంబులై చెల్వొంద విశాలవీధీ యాతాయాత రథగజతు
రగ పదాహతి సముత్థితరజః పటల సంఛాదితాంబరంబగుచు నాపణం
బులు నానావస్తు సమృద్ధంబులై విలసిల్లుచుండ నలుమొగంబుల నాల్గు
వేదంబులం బఠించు నలువ [illegible]సమర్థుం డగునేయని నేకముఖంబు
న జతుర్నిగమంబుల నుగ్గడించు భూదేవుల కాటపట్టగుచు, గట్టెదుట
నుండు వానిపోగయ్యంబు [illegible]నేరక జెట్టుమరువునడాగి రణంబొన

స్స రాముని పరాక్రమంబెంతయుని నిరసించు బాహుజుల కునికియగు చు, దనమిత్రుని పేకరికంబు శాపజాలని కుబేరుని వైశ్వర్యం బెంతమా త్రింబని యదలించు యూరు సంభవులకు నిలయంబగుచు, జాహ్నవి మానోన్నరి యగుటంజేసి మాకేమిట గౌరంతయగు మాకటాక్షంబు మాకెగాక నన్యులకగునేయని వాదంబొనర్చు పాదజుల కిరవగుచు. దేవపురంబును దేవుడేగతి యనజేసి సత్యలోకం బనత్యంబున నిలిపి భోగవతిని గ్రిందుగావించి సర్వజన విలోచనానంద కరంబగు బ్రాగ్జ్యోతిమంబను పుటభేదనంబు గలదందు నయనంబున నల యయాతి మాంధాతృ భగీరథుల గథలయందునిలిపి సౌందర్యంబున మారు గుమారుగావించి యావనంబున వసంతుని వనంబునకనిచి సౌశీల్యంబున విదురునకు బెనుకుపుట్టించి పరాక్రమంబున బరశురాముని బ్రహ్మాస్త్రంబుల నందిగ్ధంబున బాదు కొల్పి మతిచే గురుని లఘువుగా నొనర్చి దాతృత్వంబున వలాహకంబుల వెలవెలగాజేసి బాహుబలంబున నరివినరంబుల బనరంబులగావించి సర్వజనాహ్లాదకరణంబున జంద్రుని గృశీభూతునిగా నొనర్చి యివ్విధంబున సకలసద్గుణాలంకార భూషితుండగు జ్యోతిష్మంతుండను, భూపాలుండు జనపాలుండయి యలరుచుండు. ఆభూధవునకు నగణ్యలావణ్య గుణశేవధియు ననంగాంగనామదహారిణియు భారతీ రమణీసమాన విహారిణియు నగుచు వదనంబుచే జందమామకు సున్న జుట్టి భ్రూయుగళమ్మున ధనువును వంగునట్లుజేసి నయనంబుల మీనంబుల నీటిపాలుజేసి మధ్యంబున శూన్యంబుగావించి కబరీభరంబుచే తమంబును గుహలకనిపి కుచంబుల నచలంబుల దమపక్షంబుజేరమి పక్షహీనంబులుగా నొనరించి యూరువుల కదళుల వ్రాలంచేసి చరణమ్ముల దమ్ముల తోరణ మొనర్చి యిప్పగిది సర్వావయవ సౌందర్యంబులనొప్పి కాంతిమతియను పట్టమహిషిగల దా యిర్వురు నత్యంతరాగ పరిపూర్ణులయి సకలసంపదల వెలయుచుండియు బుత్రసంపద యబ్బకున్న మిగుల జింతకలంగి యనేక విధవ్రత చర్యానుష్ఠాన జపతపహోమాను దానాది కృత్యంబు లాచరించుచు భగవంతుని బ్రార్థింప మాధవు

ననుగ్రహమున నమ్మానినియు గర్భము ధరించి నందనుం గనియె. యా నందనుండు సర్వజన నందనుండై నిజశరీరద్యుతుల దిక్తటంబుల వెలుం గఁజేయ నాడింభకునకు ద్యుతిమంతుడని పేరిడి పుత్రలాభసంజనిత మహోల్లాసంబున నాభూరమణుండు యానందంబందుచు నవశ్రీలకు నిధానుండై సకల సౌఖ్యంబుల ననుభవింపుచుండె. ఆడింభకుం డను దిన విజృంభితుండై సోమున సోము నదలించు ముఖకాంతిదనర బాలలీలా లోలుండయి ముద్దుమురిపెంబుల జనకులకుం దద్దయు ముదంబుగావింపుచుండ ప్రేమభరంబున జననియు నాముద్దులపట్టి శైశవ చాపలంబుం నేడ్చునపుడెల్ల నాపోరువారింప నాయమ నాయనా యేడ్వకుమిదె యాతీవమల్లియ నీకుబరిణయంబు సేతునన్న నేడ్పుసాలించి మిన్నకుండి యాటలనీటుల పాటవంబుఁజూపుచు పాంసుక్రీడల జరింపుచు ధవళపక్ష క్షపాకరువిధంబున నానాటబెరుగుచుండె. ఇట్లు యాశాబకునకుం బదియవ వత్సరంబు పొడసూప నొక్కవాసరంబున క్రీడావశంబున బయిడుతెకే బోరగిలంబడి ప్రేటున నధికంబుగా నేడ్చుచు దల్లివద్దకుం జనినజననియు దొల్లింటి మాడ్కి మల్లియంబరిణయం బొనర్చెదనన్న నేడ్పుడిగ్గందిగిచి నాకిప్పు డప్పణతిం దెచ్చి కల్యాణం బొనర్పుమని యప్పట్టి పట్టువదలక గట్టిగ బొట్టెతనంబున నిర్బంధింప నమ్మయు నమ్మగువ యిమ్మహి నిమ్మనుజుల కెట్టులభించు శశవిషాణంబు పగిదియగు మహాఖ్యనివారణంబునకు నుడువు పల్కులు ముల్కులయ్యె నేమిసేయుదమని నాధున కెఱింగింపన ప్పుడమితే డాత్మజుంగని తండ్రీ నీకోరిన వరాంగనల బెన్నిగావింతు నమానుషచరితంబై దైవప్రసాద భాజనంబగు విషయంబు విడువుమని యెంతదెల్పినను చింతదీరక పంతంబున నిదియొకవింతయ యకాంత నవ్విధంబుననయిన నుద్వాహంబొనరించి కొని తెచ్చెద నాకుం జల్దియోగిరంబు వేగిరంబ యొసంగి బంపు మనపుడు, మాతయు. మాంరాడవెఱచి షడ్రసోపేతంబులగు భక్ష్యభోజ్యాదికంబుల ననువు పఱచి పేటికయందమర్చియివ్వ బుచ్చుకొని వందనంబుగావించి మనంబున మల్లీదేవిం దలంచుకొనుచు మెల్లన గదలి ముందర గెలంకుల నుపవన విరాజితంబులును యరవింద సుందరంబులగు కొలంకుల యుం[illegible]

నుచు గోలంకులనీనుచు నవ్యమధురస్వనంబుల జెవులబందువులు సేయు చు విహరించు మదమరాళ గమనంబుల మదిమెచ్చుచు కమలమండ డోలికల నుయ్యాలలూగు హంసమిథునంబులం గాంచి యవిముక్తశైశ వంబున బట్టంబోవుచు, వనజ మరంద మత్తమధుకరీ గానంబుల కచ్చెరు వందుచు మల్లీమతల్లికా ప్రసూనగంధంబులు బైబైబర్వ వల్లీకుంజమ ధ్యంబుల విశ్రమించుచు, నానావిధ శకుంతగణ విరుతంబు లాకర్ణింపు చు, కమలాకరంబుల పొంతయభినవ తృణాగ్ర నసపరాయణంబులైన హరిణగణంబుల నవలోకింపుచు, యటుగదలి పోవంబోవ దుర్గమారా నంబుల బయనంబుసేయ నానానదీనదంబుల జనపదంబుల గడచిచని యెదుటంబుండరీక సింహ శరభ మదేభధ్వానంబుల భీకరంబులగు వన మధ్యంబులం గంటకప్రకీర్ణ పథంబుల దుంగ ద్రుమచ్ఛాయలం బవళించి నిదురింపుచు, జీమచీటుక్కు మనం గళవళంబంది భయనినాదంబుల న లుదెసలంగలయ బరికించు శార్దూలహర్యక్ష సముదయంబుల గనుచు నందందు కిరాతజనంబులు మధ్యాహరణంబునకై యట్టిట్టుజరింప నందుం దుప్లవంగమ వ్రజంబులు కుండలనిండియుండు తేనియలం గముపు నిండ ద్రావి జనంబులంగని పాదపంబు లెక్కిపాదంబులపై నిలచి కనుబొమ లెత్తి వెక్కిరింపుల బెదరుబుట్టించు వింతలంగనుచు, జనిచని పుణ్యాశ్ర మంబుల బుణ్యనదంబులం బావనతోయంబుల దర్శింపుచు నొక్కెడ నమున్నత ప్రాకారసంశోభితంబును ధ్వజస్తంభాగ్రీ విల నత్కింకిణీ చిణి చిణీ నినాద మేదురితంబును సహస్రపాదంబుల జిత్రంపుబనులదొప్పి దంబై తీర్పుల నేర్పుల నేర్పరచిన తివియలనంటి రాజిల్లు శారికా కీరం బుల బంతులు వింతలై గన్పట్ట జలువరాతిబటువుల బరవులై నిగన్నిగ లజెన్నలరు ముఖమండ పాభ్యంతరంబు గలిగి, నానాద్విజబృంద సంకు లారావరమణీయంబగు గర్భగోపురంబలర విశాలోన్నత కవాటగుస్తం బై పొంపుచూపించు దేవతా నికేతనంబుగని, భక్తింబ్రణామంబు లాచ రించి యటుగదలి పోవుతఱి నందొక్క జటిగ్రామణి నిశ్చలసమాధి నుంసి రాకొమరు కాలిచప్పుడుల యలికిడి విని కన్నులుదెరచి యతిడ

వంబున ముందరంజను నతిబాలుం గతిలో లున్నతశీలుంగని ఓయి రా కుమార! యిటురమ్ము. యిటురమ్ము నవుడు యానృపబాలుం డాయెలు గాలించి యదరుపాటున తిరిగిచూచి యివ్వనంబు జనరహితంబయ్యెంట నీదృశ కంఠధ్వని యెవ్వరిదని విచారించి మరలం జనుచుండ నమ్ముని గ్రామణి తొంటి విధంబున బిల్వ బల్వగలంజను నాభూపకిశోరుండు సంకుశంబున మదగజంబును సూత్రంబున బ్రతిమయు ఖలీనంబున నశ్వంబును తిరుగునట్లు వెనుకకుందిరిగి శ్రీభగవన్నికేతనంబు జేరంజనుదెంచి యందు అభినవ రాగరంజితంబగు నిందు బింబంబు చాడ్పున నరుణజటామండల మండితాననుండును, సామివికసితారవింద సుందర నయన విరాజితుండును, విశాలోరస్థలోపేతుండును, విదీర్ఘ పంచశాఖ ద్వంద్వ సమలంకృతుండును, శంబరభవా సనాసీనుండును ధనుర్వ్రశ నఖరభాసితుండును, ధ్యానాసక్త శేముషీ విశేషితుండగు నత్తపసుల మేల్బంతిం గాంచి ధరాధవ సూనుం డతని చరణకుశేశయంబుల కెఱఁగి వినుతించి నిలువంబడియున్న, ఆకుఱ్ఱనిం గని ఓయి నృపబాలకా నీవిట్లొంటరివై యెందుజనెద లిందుకుం గతంబెద్దియన్న నే దీవెమల్లియం బాణిగ్రహణంబున గ్రహింపనేగెద ననువుడు నాబడుగుల యెకిమీడక్కృత్తనయు వృత్తాంతంబెల్లం యోగవిద్యామహిమంబున యెఱింగి యాతని దిటవుంగన నిదియేమికుమారకుమారుండవై మారుం దారుమారు సేయురూపంబలవడనల మటంబడక బడతుకలం దండ్రివరిణయంబు సేతునన్నవలపడని లతామల్లింబరిగ్రహింప దలంచితి విది మనుజ సామాన్యంబగునే తపోధనులకైన నలవిగాదిత్తెఱంగు మరుంగు జేసి పురంబున కఱుంగుమని నుడువ నాబాలుం డా జాలంబుదెలసి యేలీలనైన వల్లీమల్లిం బరిణయంబయ్యెద నెందైన గొనితెచ్చెద ననుగ్రహింపు డిదె పోఁవచ్చెదనని మరలి పోవుచున్న పుడమి మగనిపట్టింగని ధైర్యనయ వినయ సంపదలకుం గరంబు సంతసించి యత్తపసి ధీమన్మణీ నీకుంగార్యంబు సేకురు నిందుకే నొక్కయుపాయంబు దెల్పెద. అదెట్టులన్న నేనుఫలంబుల మూటి నభిమంత్రించి యిచ్చెద నయ్యవింగొని నేటిసా

యంవముయంబున కొంతదవ్వరిగెడ నాప్రదేశంబున నీమూట నొక్కటి
బై కొగమిూటిన నదియొక దివ్యతరువై గన్పట్టు. అన్యతిరోపలంబొక్కటి
గొని తద్భూజ విస్తృత వర్ణాగ్రంబున కొగ్రవేయ నందుండి యొక్క
జంబీరఫలం బయ్యుపలంబుతోడ [illegible]బ్జంబున కటుదెంచు
గైకొని నీదు మేల్వాలువలోన గట్టిగాఁజుట్టి గొంపోయి నేప్పుడు [illegible]
వైవక దద్దయు ముదంబున గద్దెపై నునిచి బూజించుచు బరిణయపు వాస
రంబునం దారాబల చంద్రబల సమన్విత లగ్నంబున మేల్పుట్టింపు
మూటిం గల్యాణపీఠిపై నునిచి మంత్రతంత్ర మంగళవాద్య ఘోషం
బుల మాంగలికసూత్ర ధారుణంబొనర్ప నందుండి యొక్కయింతుల
మేల్బంతి నీచెంతనిలుచు. ఆభామయె నీకోరిన వరాంగనయగు లతా
మల్లియ యని వెలియంబలికి దాఁజెప్పినలీల బ్రస్తరత్రితయం బభిమం
త్రించియిచ్చె. అదిగైకొని జడదారితిలకమ్మునకుం బ్రణమిల్లి రాజరాజవి
భవుండగు రాజనందనుండటు వెడలిపోయి బోయి సంధ్యాసమయంబ
గుడు నరుణప్రభాపటల పాటలిత పల్లవంబుల రమణీయంబై తరుకోట
ర ప్రవిశదండ జగరు దనిలసంచలిత శాఖాప్రకరంబును శకుంతకుల
కలకలధ్వాన సుందరంబును జివురుల మెసవి కసరెత్తి విసరున చెరువ
రుల డెందంబు లవియ బిగ్గఁగూయు గోయిలల గములుగలిగి వికస్వర
పికస్వనంబుల సొంపలరి నానావిధ విటపి విటపచ్ఛాయా బహుళంబై
సజ్జను తెఱంగున సర్వజన సేవ్యంబై యొప్పు నొక్కమహావనంబు డగ్గ
ఱి యందలి రమణీయతకు మదిమెచ్చియందు కమలాకరంబొండు గని
తజ్జలంబుల కరపాదంబులు శుద్ధిఁగావించి తన్నికటంబున బ్రకటరమ్య
ప్రదేశంబున నిలుచుండి దైవగురువందనంబు లాచరించి మునిప్రదత్తం
బగు ప్రస్తరంబొక్కటిం గైకొని లీలవ్రేల బై కొగమిూట నయ్యుపలం
బదృశ్యంబై మఱిగొంతసేపటికిం గోమలంబై యుసురతర శాఖలం బరగి
నవోల్లసత్కిసలంబుల ఛదలంబులు మసలకందిరుగ నసదృశకుసుమ వి
సరంబుల గమ్మనితావులు వెదజల్లుచుండ బ్రసూనమంజరీ పుంజంబుల
బింజరితంబై యదృష్టపూర్వఫల భరితంబగుచు సనేకవిధ ఖగస్వనం

బుల నందమైయొప్పునొక్క భూజంబుగని వెఱగంది యియ్యది నాకుఁబ్ర
త్యక్షకల్పక మహీజంబు గావలయునని మునివచనంబులం దలంచికొని వే
ఱొండు ప్రస్తరంబుం గదియవర్ణాగ్రంబున కూర్ధ్వముఖంబున కెగ్రవే
య నయ్యుపలంబు త్రోడన జంబీరఫలంబొక్కటి గ్రిందరా జూచి తల
యూచి జవంబున కరంబున గ్రహించి తత్తరంబు వడక నుత్తరీయంబున
జుట్టి చంకనిరికికొని తావచ్చిన విధంబున స్వనగరంబున కభిముఖుండయి
తారహారడిండీర పాండురంబగు చంద్రికాజాలంబు దిశలబర్వి పాలుపొం
గినరీతి దోప జకోరమిథునంబు లన్యోన్య రాగరస పూరితంబులగుచు న
జ్జకరప్రాశనంబున దనివిజెంది మెలంగ దరు లతానిచయంబులు దళతళ
కాంతుల రంజనంబొనర్ప నిశానమయంబు కతన రాత్రించరజంతు నివ
హంబు లందందుజరింప జలిపక నోషధిమాలంబులు దీపకళికలంబోలి
దీపింప రాజనందనుండు శేరాజం దనముఖచ్ఛాయల నదలింపుచు బో
వుచున్నంత నిశాంతంబున శాంతకిరణుండగుచు జైవాతృకుం డపరాద్రిం
జేర గొక్కొరొకోయని కుక్కుటారవంబులు మిక్కుటంబుగా దిక్కులం
ట నరుణరుచిపరంపరలు బవవంబుల డంబంబు నడంచుచు జదలంట జా
హ్నవీ జలంబుల ఛాతి నచ్చంపుదెలివెలుంగులలర బ్రాచీముఖంబున
సిందూరంబు వడువున నినుం డుదయాద్రిదోప నంతనృతసంబంధి కొంత
దవ్వరుగ పురంబు సమీపించె. అటగాలోచిత క్రియలొనర్ప బుడమివె
లంతి మగనివట్టి యచ్చేరువ నొక్కసరోవరంబు పొంతనొక్కెడ గట్టిగ
జట్టియున్న మూటింబెట్టి శౌచక్రియ నొనర్ప నావల గనుమఱుంగై జని
న నామూటిగ్రింన వైచిన కతంబున నందుండి యొక్క భామిని భూమి నిం
కెందుంగావని సౌందర్యంబులవడ పట్టువుట్టంబుపై నిగనిగ మెరయు సరి
గబొట్లమర బైట చెరంగున రంగుబంగరు మామిడిపిందెల వరుసలలర
నందు కుందనంపు గూళ్ళబంతుల వింతగ నిమిడ్చిన దొమ్మిదివిదాల రత
నంపు కారు లొప్పార సంచులు బ్రవదంబుపై మిసమిసలాడ గులికీ రవి

కెప్పై గూర్పుచక్కలంచంబులై చకచకమెఱయు గుత్తంపు రవికెం బిగిం
కొని యరవెడలిన చన్నుదోయియొప్ప పసిడియొడ్డాణమున జెక్కిన
కెంపులవెలుంగులు దెసలబరువిడ కాలియందియల ధళధళద్యుతు లకా
లచంద్రికల నీసముత్యాలపేరు లురమ్మున చంద్రహారంబుల ననంగిపె
నంగ వజ్రంపుగమ్మల ధాగద్యంబుపై పైగదియ ముక్కర యర
చందురుంబోలె గన్పట్టి నాసామౌక్తికంబు ముఖారవిందంబున
రాయంచయుడిన గ్రుడ్డుపోల్కి గాన్పింపడుగనక కనత్కరకంకణంబులువ
లయితంబులగు చంచలాలతల లీల వెలుంగ సీమంతప్రదేశంబున బాపటి
బొట్టు రాకాశశాంకుపోకడంప సందిటదాయతులనుపై మెఱుపు బంతు
ల బుట్టింప నీచందంబున భూషణాంచితయై వగలకు నెలవగుచు వామ
హస్తంబు గటిం జేర్చి దక్షిణకరంబున పూబంతినిడికొని వెడలి సర్వాం
గసుందరియై నిలువంబడి యుండె. అచటికి జలాహరణార్థం బప్పత్తనని
వాసినియు, ప్రౌఢయునగు నొక్కకులాల యువతి ఘటంబుగొని నీటుత
నంబుగ నరుదెంచి యందు నిందు గ్రిందు సేయు పొందిక మొగంబు దన
రమెఱుంగు తీవియల తెరంగు నగరంబులరు దేహప్రభలుల్లసిల్ల భూషణ
ద్యుతు లంబరంబున నింద్రచాపప్రభల నినుమడింప బాలవెల్లి నుదయిం
చిన రమయో లీలజల్లనికొండ నుద్భవించిన యమునయో యన్నరీతి వెలుంగు
యన్నాతింగని చోద్యంబంది తనమనంబున నౌరా యీనీటుకత్తె వగ
లంగన్న నెట్టిమగలైన నిట్టట్టు జనక కట్టువడి పంచశరవంచిత హృద
యులై దీనికిదాస్యమొనర్తురనుటకు సందియంబులే దీలేమ కతినెరిం
గదనని డగ్గఱి యగ్గరిత నోకొమ్మా! యిమ్మహి నీవెచ్చట వసింతు వె
వ్వరిదాన వేకతంబిట్లుండుటకుం గారణంబెద్ది? నీతనూవిలాసం బనూనరా
గ నిదానంబు, మణిమయభూషణంబులు జనగణాతోషణంబులు, నీదువృ
త్తంబు నాదుచిత్తంబున సంసక్తంబగున ట్లెఱింగింపుమన్న నాపొలతి య
ప్పడతింగని నాతీ నాతీరువివరింతు జాతి యం దున్నతింగనియు నన్నిజా
తులం గలసి మెలసి నాదు గుణసౌరభంబున దలకెక్కి మనోహరత
లీలలం జెలంగి తీరైనదంత కుట్మలంబలర విహరించి యపూర్వరమ

ణీయతంబరగి. మాకుయాకునదుమ పదంబధిష్ఠించి, యాశిమన్ణతంజేసి తుద మొదలంటి వర్తించుదాన, దానంజేసి సర్వజనహృద్యంబై తోచియు దోచినంత నాశావిలాసపదంబై విలాసపదవతీ సేవితంబై సేవితదైవపద జనవశంబై మెలంగుదు, నీధరిత్రీ నాథుపట్టి పట్టిన పట్టువదలక మునినాథుబట్టి యెట్టకేలకు ననుంబట్టి తెచ్చి క్రిందవైచిన కతన నేనిట్టియుతినన్న నాతీవెమల్లింగని యానాతి యీరీతింగన్న నృపసూనుండు మోహితుండై యన్యులందేరి చూడడని తలంచి యత్తలిరుబోఁడింగని యోయక్క నీచక్కదనం బెక్కడివారలకైనగలదే. నీతనువిభవంబతిసంవిభవంబనజెల్లదె ఇమ్మణిస్మ్యతులు ద్యుమణిద్యుతులనిరసించు నిమ్మనిచాయుంగన్న కనకంబు పుటశోధితంబుగావలయు నిగనిగమెరయు సరిగవలువచక్కి చక్కంగన సాధ్యంబగునే నీ సకలాలంకారంబొక ఘటికామాత్రంబు ధరింపవేడెద నంచివర కస్మదీయాలంకారం బీవుధరింపుమన్న నందులకియ్యకొని యాలతాభామ భూమిపమాభరణంబులొసంగిన నయ్యవిధరించి యక్కులాలలలన తనదు మలినాంబరంబొసంగ గట్టినిలువంబడియున్న వామాక్షింగని నిసర్గలావణ్య మహిమంబునకు మదిమెచ్చి ఘటికారసుందరి యిద్మనవతి యమ్మగుదబలల నబలల గావించు ఠివింగన్న చిత్రంబయ్యెడి నీపెమహిమం బమానుషంబు గావలయునని యొక్కతంత్రం బూహించి మానినీమణీ మాననీయంబగు నీసురూపగుణ శీలంబుల గన్న నద్దియోయొక మాహాత్మ్యంబున్నట్లు దోచెడి నేడీమాత మీకలశంబున నీరూపమడంగునట్లు గావింపుమన్న నారమణి కపటంబెరుంగమి రమణీయంబగు తనదురూపంబక్కజంబుగా నక్కలశంబున నిమిడించె. నదిగని యక్కలశకరయువతి యాత్మగంబొక్క రాతిపలకంగని దానిచే కలశముఖంబు మూతగావించి సరోజల మధ్యమంబున కెగద్రోయ తరంగపరంపరల వశంబున నాకలశం బల్లలనాడుచు ననితరసాధ్యంబగు తోయంబున తనదు తోయంబెఱుంగకుండ మూలకొదిగియుండె. నంతనంతసంబున చింతదీరునని యక్కాంతమొగంబున జనునవ్వాలయు రాజపుత్రురాక నిరీక్షింపుచు హాయలుమీర మీరిన తమకంబున నిలుచుండియుండె నాసమయంబున

శాఖాదారదారకుం డటుదెంచి చూచియపుడంది యీలేమయెవ్వత యొక్కో భూషణాంబరద్యుతు లంబరంబున విద్యుత్పరంపరల నీనెడిం దీని వగలంగన్న మనంబు పొగలెడిదారా యీరామ యామాము దేవతయొ మనుజకాంతయొ దీనికత నెఱుంగవలయునని చెంతజేరనిలచి నితంబినీ నిజంబుగ నీవెవ్వత విందొంటరివై యుంటకుం గతంబేమి నీదృక్కువలయంబుల నెవ్వరి నలంకరించెద విత్తెఱంగు వివరింపుమన్న నాతొయ్యాలియయ్యవనీశుపట్టిం గని పట్టనిమోహంబుననో కువలయేశనందన! లాలితయువతీజన మోహన! లసన్మారరూప! యువజనాగ్రేసర! వర్ణ్యాగలావణ్య తిరస్కృతరకలానన నావివరంబీ వెతింగియు మొదలింత వర్ణంబడుగ నేల నేలనై చినకతన నేనిబ్బంగినైతి నైతినిబో మఱువందగునే తగునేటుటురాడ యాడవారల మనంబెఱుంగవుగా బోలు బోలు మాటలాడి యలయించెదవో యలయకమురి వచనంబుల దలంపును తలంపునకు జంబీరమ్మూదెమ్ము తెమ్మన్న భంగి భంగింపనగునే యేదీవె మల్లియగదా యని తెలియంబలికినరీతి వివరింప నారసాప సూనుండు రసార్ద్రహృదయుండై యివ్వనమూంబక తీవెమల్లియమె కావలయు లేకున్న మనిరవాస్యంబెట్టులుగు. మదీయాపరాధవశంబున నిట్లయ్యెనని తలంచియు కపటమల్లింగన్న సంతోషంబున బిరానకరాన కపటమల్లీకరంబువట్టి గోల్కొనిపురంబు సేరి నిజాంతఃపురంబు ప్రవేశించి గురుజనంబులకుం దాదీవెమల్లియం దెచ్చిన విధంబుదెల్పి యేనిక్కన్యం బరిణయంబయ్యెద నిందులకొక్క శుభముహూర్తంబు నిర్ణయింపుడని జనకులకుందెల్ప వారందఱ లాశ్చర్యంబంది మల్లియనేమి తెచ్చుటెట్లు ఇది యొకవింతయె. ఇక్కామిని యెవ్వతయొక్కొ దీనివృత్తం బెఱుంగవలయునని జననియు నాబిడంగాంచి యమ్మా నీవెవ్వత వీబాలుండెందు (నిన్నుంబడసె నినుంగన్నవార లెవ్వరొక్కొ ఇయ్యమూల్యాభరణంబులంగన్న చోద్యంబయ్యెడి నీచరితంబు హృద్యంబుగా దెల్పుమన్న నక్కపటమల్లి యాదీవెమల్లియ దపసి యనుగ్రహంబున నీరాజుననుంబడసె సరోవరంబుపొంత నన్నుంజూచి మోహించి యిటకుదెచ్చె నిదియనావృత్తాంతంబనిన నాపెయు నమ్మగువ వచనంబుల

నేదోసంశయంబుదోఁచియు నేమనజాలక మనజాలినజాలునని పతికెఱుం గించి యొక్క శుభవాసరంబున నాయిరువురకుం బాణిగ్రహణంబు తె ఱంగున నుత్సవంబొనరించి రాజపుత్త్రి మనంబున కుత్సాహంబగునట్లు గావింప నాపుడమిఱేనిపట్టి పట్టినకార్యంబు నేకురెనని తద్దయు బ్రమదం బున నాప్రమదయుం దనుఱాగరంజిత హృదయుండగుచు క్రీడాలోలుం డై వర్తింపుచుండె. ఇట్లుండ నక్కమలాకరంబున గపటమల్లి చేవిడు వంబడిన కలశ మల్లిక యందుండి యొక్కపంకేరుహంబు సహస్రభాను కై వడి సహస్రదళయుతంబై జాతరూపంబుకతన జాతెరూపంబై కెంపుల వెలుంగులజాడ కెంపుకాంతిదనరి సొంపుమీరి తాకమలంబగుట గమలా ప్తరశ్మినొప్పి సారసంబనజాలి సారసహితంబై తామరయన్న దమకులం బునకు లోపంబని కుశేశయంబై మదనసాయకంబౌట నరవిందంబై యం బ్జబింబాకృతి నబ్జంబై వెలసి కనకచ్ఛవిఘటలంబరంబున బర్విసౌదామి నిలతలభంగిదోప నిఖలజననేత్రభ్రమరనిచయంబులు తన్నువిడువక నంటియుండ మనోహరంబై యుంట జూపరులెల్ల నిశ్చేష్టితులై మెలం గ నతిసుందరంబై పొడసూపె నదిగన్న జనవారం బందంచు తత్సౌంద ర్యమహిమాదుల వర్ణింపదూతీ ముఖంబున గపటమల్లి తద్వృత్తాంతం బెఱింగి మల్లిదేవి మహిమంబని తలంచి తత్తామరసంబును దాదెప్పించి రూపడగింప నుద్యోగించి రాజతనయురాక నిరీక్షింపుచున్నట్టి యవస రంబున నాతండటకు విచ్చేయ నాభామయు సవినయ భావంబున రా జుచెంతనిలిచి ఇప్పుత్తనోపకంఠ సరోవరంబున నొక్కసరోరుహంబున్న యది దానిందెప్పించి నాకిప్పింపుడనవుడు భూభృన్నందనుండు తోడన భటులంబిలచి తన్నీరజంబును దెమ్మన్న వారలేగి జలంబుల నీదుచు గ్ర హింపబోయిన దానీటమునుంగు నీటమునింగి గ్రక్కొందమన్న నీటిపైట నిలచు బయలంగన్న మూలలకేగు మూలలకేగిన మధ్యంబుననిలుచు మధ్యంబునకుంజనిన సోపానపథంబునందోచు నటకుంజనిన నదృశ్యంబ గు నిప్పగిది నసాధ్యంబై తోచిన వారలు విసికి యేలికపాలికింజని మ హాప్రభూ యత్తమ్మిదెచ్చుట మాతరంబైన మాతరంబుగాదు చేతికిం

దోచు దోచినమునుంగు మునింగినదేలు దేలినమూలకేగు నేగినకనుమ
రంగగు కనుమరంగినగాననగు నయ్యామాశక్తి యుక్తులన్నియు నణం
గిపోయినవని విన్నవింప రాజసూనుం డచ్చెరువంది యౌరా యిప్పంక
జంబెంవింతగ నున్నయది. నేబోయి తెచ్చెదనని యాక్షణంబ తత్సరోవ
రంబునకుంజని సోపానంబునఁగూర్చుని నీటఁ జేయిఁజాచిన క్షణంబున
నత్తోయజంబు నృపసూను హస్తగతంబై నిలచె. నదిగని సర్వజనంబు
లు విస్మయంబంది రంత సంతసంబున నృపబాలుం డక్కంజంబుఁగొని
గ్రుతంబున నేగి కపటమల్లియకొసంగె, నదియు దాని సొబగుంగని స
హింపనేరక భవనపాశ్చాత్యభాగంబున బడలాగు పిసికివైచె నంతనా
సహస్రపత్రదళంబులు మృదులంబులగుటం జేసి తేకులన్నియు చెదరి యం
దందు నిపతితంబులై భానుకిరణ స్పర్శంబున వాడియు శీతకరస్పర్శం
బున రసార్ద్రింబై కొద్దివాసరంబుల శాఖాదండంబు లన్నియు శాకకాండం
బులై విలసిల్లె, యక్కాండంబులు నానాటఁబెరిగి రసఖండంబులై యం
తరాళంబున మృదులతంబరగి పీవరత్వంబునకఁ జళులకెనయగుచు విస్తీ
ర్ణపర్ణయుతంబై యందంబుగా మొరపుందనమున గనులపండువుగ
వెలుంగుచుండ నదిగని తదీయవాచకు లక్కాండంబుల బ్రతివాసరం
బును బచనంబొనర్చి భక్షింప ముక్కలిరుచ్యంబై యెల్లరుల కానందం
బొనర్ప గపటమల్లిరసనంబునకు దిక్తంబుగాదోప నది వర్జింపుచు
డిమెక్కడి శాకంబిట్టి యనుపయుక్త పదార్థంబెక్కడఁగొని తెచ్చితిర
వారలవలన మూలంబెఱింగి తక్కాండంబొక్కటి మిగిలియున్న దా
నిం బెఱికి ప్రక్కనుంటి పెరడునకు విసరివైచె, నంత కొంతకాలంబు
న కాదండశాకంబు నీటిపాటున చల్లపిదనమున భూరసత్వంబున న
క్కరసాల మహీజంబై యనువిన ప్రవర్ధమానంబగుచు నభినవశా
లుదయింప బితామహు తెఱంగున చతుర్ముఖితం బరగి మాధవప్రీ
మాకందంబై శంకరువిధంబున నీలకంఠశోభితంబై శాఖావిలసితం
గుట వేదమయత నలరి, యపర్ణాకాకున్న సపర్ణాయయ్యునని శ
యాబహుళంబై వాణి తానయ్యేనని యే బికవాణికాకుండు నేయు

పరభృద్వారరమ్యంబై నవయౌవన విరాజితయగు విలాసవతింబోలె
పల్లవకర లలితంబై యొప్పి ప్రసూనమంజరుల బాంధజన హృదయం
బుల నలయింపుచు మకరందపానమత్త భ్రమరగానంబుల రసికజనమ
నోల్లాన కరంబగుచు నమృతరస భరితంబులగు కలశంబులవడువున
నొప్పారుఫలంబుల నవ్యపరిదృశ్యమాన స్వాదిమ బరిపక్వంబులై వెల
య నాచూతభూరుహంబత్యంత హృద్యంబయియుంటగని అయ్యింటి
వారిది భూలోకకల్పకంబు పగిది దోచుచున్నయది మనయదృష్టవశతం
జేసి ఇట నభివృద్ధయయ్యె నని సంతోషింపుచు తదీయఫలమూల్యం
బెక్కువగా నదికారణంబున నెక్కుడుధనంబార్జించి యాగృహపతి ధ
నేశ్వరుండని పేరువహించె, నిట్లుండ నొక్కనా డక్కపటమల్లి దూతి
యాఫలంబుల గొన్నింటిగొని భక్షించి యతిరుచ్యంబులుగ నున్న
దమరాణికొసంగ నాపె యాఫలంబుల రమణీయతకు మెచ్చి యొక్క
ఫలంబుదిననగునని నోటియం దునుప ముష్టింబలె దిక్తంబుగానరా నో
హో యిదియెక్కడి ఫలంబని పాఱవైచి తదవస్థితి నెఱింగి ఇయ్యది
మల్లీ మహిమంబని తద్భూరుహోచ్ఛేదనంబొనర్ప నుద్యోగించి
యాక్షణంబ శయ్యాగారంబు జేరి పర్యంకంబున బవళించి పైటిచెఱంగు
ముసుగిడి కపటశిరోవేదనం బొరలుచుండ నటకు నరనాథనందనుండరు
దెంచి యోయమ్మ నీకేమిటం గొరంత యెందుకీవగలం బొగలెద విం
దులకేమి గతంబు యది యెట్టిదైన నాకార్యంబు నెరవేర్చెదనని నృ
పుండానతీయ నాభామ ప్రక్కయింటి తియ్యమామిడి నీడసోకుట శిరో
వేదనంబొదవె దానిందీయుంపుడనిన రాజపుంగవుండది యెంత ఇదిగో
చూడుమని భటాగ్రణులంబిల్వంబనిచి మామిడి నఱికివేయుడనిన వా
రలపుడ యటకేగి తరు భేదనసాధనంబుల తదుచ్ఛేదనంబున కుద్యోగిం
ప నాభూజంబదృశ్యంబయ్యె. నదిగని వార లపరిమితాశ్చర్య రసాంబు
ధి మునింగి తచ్చరిత మాభూపతికిం దెల్ప నాభూనాయకుం డచ్చెరువం
దుచుండె. నంతి నారేయి యపరరాత్రంబున నాగృహపతి రసాలభూజం
బు గానరామికి మిగుల వగచి చింతింపుచు నాప్రదేశంబున నన్వేషిం
పుచుండ నందొక్క మాతుఫలంబు లభింప నద్దానింగొని తెచ్చి ఇచ్చ

దియె నాయదృష్టఫలంబని యొక్క పేటికయం దునిచి తాళంబువైచి మరలివచ్చునవసరంబున యోతండ్రీ! ననుండీయుము ననుండీయుమని యొక్క ధ్వని వినరా నతం డదరిపడి నలుదెసలంగని దిగ్భ్రమంబంది భయంబున గనులు మూయుచు దెఱచుచు గాళ్లువడవడవడంకి తడబడ నురమ్ము దటతట నల్లాడ రిచ్చవడి నోటనడ్డుయార నిదియేమి యొక్కొ యీస్వరం బెచ్చటగల్గె నశరీరవాణియో లేక భూతారావంబొ ఇది యేమిచోద్యంబు వేద్యంబు గాకున్నయది ఇచట మనుజులెవ్వరుం గానరైరి యీగతి నామతి కింత విభ్రమంబు గలిగించె నైన కానిమ్మని మరల నధైర్యస్థైర్యమ్మున గదలి పోవుచున్న దొంటి మాడ్కి పేటికయందుండి భయపడకుము రమ్ము పేటిక దాళంబు దీయుమని చెప్ప నాగృహస్థుం డిది దైవమాయయె యన్యంబుకాదని నిశ్చయించి ధైర్యం బవలంబించి మెల్లన నటకుంజని పేటికతాళంబు దెరచినమాత్రన జలదచ్యుతంబగు తటిల్లతిక తీరున కనకంబు రాశిబోసినచందంబున కుందనంపు తీవియభాతి అగ్ని హరిద్రావిధంబున గనులకు మిఱుమిట్లు గొలిపి రతియో భారతియో రమయో యుమయో వసంతలక్ష్మియో గంధర్వకామినియో నాగకాంతయో సిద్ధాంగనయో యనం దేజరిల్లుచు మణిమయ దీపకళికంబోలె వెలుంగుచున్న రమణీమణిం గాంచి ధనేశ్వరుం డహహా యిట్టి సౌందర్యాదిగుణంబులు మనుజ సామాన్యులకగునె నాపాలిటి భాగ్యదేవత కాబోలు నని నయ భయ విస్మయంబులు పెనగొన దల్లీ నీవెవ్వతె విట్లిం దుద్భవించిన రీతియెట్లు నన్నుంబాలింప నేతెంచితివా భవత్సేవంజేసి యే ధన్యుండవయ్యెద ననుగ్రహింపుమని విన్నవించు ధనేశ్వరుం గని పేటీయువతి నాయనా నావృత్తం బనన్యగ్రాహ్యంబు కొన్నిదినంబులకు దమస్వాంతంబునకు దేటయగు నంతవర కీమందిరంబున నుండగోరెద నన నందుల కాతండు శిరసావహించి యమ్మా నెమ్మనంబున సమ్మతిగ నుమ్మతిల్లక నెమ్మదిగనుండుము పలయు పదార్థంబులిడి భవత్పాదసేవ జేయుచు నే గృహస్థుండ నయ్యెద నని సౌధోపరి భాగంబున సకలవిధసౌఖ్యంబు లమర్చి షోడశోపచార విధులం బూజింపుచు సుఖంబుండజేసి తదుదంతం

బెవ్వ రెఱుంగకుండ గావించి వర్తింపుచుండ నొక్కవానరంబున బేటీసుదతి యభ్యంజనంబొనర్చి తలయార్పుకొనుచు కరరుహాగ్రంబుల జిక్కు వడలింపుచుండ నొక్క శిరోరుహం బూడి సమీరనీతంబై కపటమల్లి భవనాంగణంబున బడియె. నది యతిదీర్ఘతమంబగుడు వినీల స్నిగ్ధత్వంబున జుట్టంబడి పట్టుయుండ మాడ్కి దీపితంబై నిగనిగ మెరయుచు గాన్పింప దానిం గపటమల్లిచేటి యొక్క తెచ్చూచి తలయూచి యహా రా యీకేశంబున కింతసొబగొప్ప నీకేశధారిణియగు సుకేశిని యెవ్వతె కావలయునని నలుప్రక్కల గలయంజూచి ధనేశ్వర సౌధాగ్రంబున గవాక్షంబున నిలువంబడి తలయార్చుకొను యువతిం గాంచి నిశ్చలాంగియై యాహా యీమదిరాక్షి యెవరొక్కొ త్రిభువనంబుల యెందేని నిట్టిసుందరిం గానమని మనం బుఱియాడ నతితీవ్రంబున గపటమల్లిచెంతకేగి తత్ప్రవృత్తియెల్ల దెల్లంబుగా దెల్పి శిరోరుహావుయుంట జూప గీలుబొమ్మయుంబోలె చివాలున వంగి తొంగి వింగి యవ్వామనయనం గని ఆశ్చర్య భయ క్రోధ చింతారసంబుల గ్రుక్కి గ్రక్కున వెక్కసపాటున నక్కపటమల్లి నిక్కి నీల్గి చిక్కని తాపంబు నొంది మల్లీదేవి యేయని నిశ్చయించి భ్రమసి తిరుగుడువడి నిట్టూర్పుల నిగుడింపుచు నుస్సురనుచు నిసీయనుచు చేటికల గోపింపుచు పర్యంకంబున గాలదన్నుచు మణిహారంబుల దీసి పారవైచి పట్టురవికెం బటుక్కున చించి క్రిందయుంచి సరిగచీర సడలించి వైచి మలినాంబరంబుధరించి యెద్దియో తలంచి యెద్దియో జేయుచు దద్దయు దుర్భర చింతావేశంబున సురాపానికైవడి నున్మత్తవతిచాడ్పున శ్లేష్మవతితీవన నిద్రావతియనువున సర్వేంద్రియ విభ్రమతనొంది నేలబడుండి ముసుగిడుకొని మూల్గుచు మూలమూలల బొర్లుచుండ నట్టిసమయంబున భూపాలాత్మజు డట కరుదెంచి యరుదందు నేలబడి పొరలుచుండు నారింగని వారింప దలపడి మదవతీ నామదియెఱుంగనె యెందు కింత వగలబడియెద వది తెలియంబలుకు మద్దెయైన నొనరించెద హితాహిత వస్తుసార్థ్యసాధనంబుల సహితహితవస్తుసార్థ్యసాధనంబులుగా సమకూర్చెద నెట్టివస్తువైన దివినుండి భువికిం దెచ్చెద నసాధ్యంబు

సాధ్యంబుగా సాధ్యా బసాధ్యంబుగానైన గావించెక బైకిలెమ్మనికరంబు పట్టి కూర్చుండనియోగించి శ్రమనివారణ మొనర్చిన నయ్యంతి చింతిల్లి యయ్యా నేను మీకు బ్రియురాణియయ్యు మీకు దేశాధిపులయ్యు బ్రక్క గృహంబునవసించు ధనేశ్వరు సదనంబునకే తెంచియుండుగొక్క సామాన్యస్త్రీ ముఖనిష్ఠీవనంబు నాశిరంబునధరించవలసె నిదిగాక నయ్యంగన ననుజూచిపకపకనగుచు పరిహాసంబొనర్చుచులోపలికింజనియె నదిమొదలు నాశరీరంబున పెనుమంటలెగయుచున్నవని నృపునకు గ్రోధంబునయి చున్నల్లువల్క హా యెంతకండక్రొవ్వుగలదా కాంతభూకాంతు రాణియగు నిన్నిట్లవమానింపనగునె ఇయ్యవమతి నాకుంగల దింపాలకుందగు రీతి నొనర్చెద వగజెందకుమని ధైర్యంబుచెప్పి భూధవాత్మజుండు యంతరంగంబున మంతనంబొనరిచి భృత్యులం బిలచి ధనేశ్వరు భవనంబునవసించు వనితం బాలకియందునిచికొని పోయి జన జల తరు రహిత వనప్రదేశంబున విడిచి రమ్మని యాజ్ఞాపింప నాభటశ్రేణి రాజానుశాసనంబు శిరంబున ధరియించి ముత్యాలపాలకింగొని ధనధవుని శాంతంబునకేగి ఓయి మీయింటనుండు కన్యామణి నీపాలకిపై నెక్కింపుము లేకున్న నిన్నుదండింతుమన్న నా కటువచనంబుల విని ధననాధుం డేమియు దెలియక మూర్ఛిల్లి మరికొంతసేపటికి దెలివొంది సాధ్వోపరితలంబునకుబోయి పేటీవనితకీ వార్త దెల్ప నాసుందరి నాయనా నీవూరకుండుము కాగలది కానిమ్మని నివారించి యావలం బనుప నంత రాజభటులు కొంతసేపు నిరీక్షించి యాపె రాకున్న మేడయెక్కి యమ్మా రమ్ము భూనాథుండు నిన్ను బాలకినెక్కించి జన జల తరు రహిత ప్రదేశంబున విడువంబనిచె రాకున్న బలవంతంబున గొనిపోదుమన్న నమ్మగువ యేమియు కూరకున్న వారలు కరంబుగ్రహింపబోవు సమయంబున నాయంగన యదృశ్యంబయ్యె. నంత వారందందు వెదకి గానక విసికి ఇయ్యది విచిత్రంబుగా నున్నయది. ఈయువతి దేవభామిని కాబోలు ననుకొని తా మంపు గన్న చరితంబెల్ల భూపతి కెరుంగింప నాతండతివిస్మయాక్రాంతహృదయుండై యేమియుంబోచకమిన్నకుండె.

ప్రథమోల్లాసము సంపూర్ణము.

# వల్లీమల్లి.

## ద్వితీయోల్లాసము.



ఇట్లు కొన్నిదివంబులుచన విశ్వంభరాకాంతుపట్టి యొకదినంబున మృగయాపర్యటన లోలతం బురజనంబుల కెల్లర[illegible]రుకల్యంబున మృగయావినోదార్థం బరుదేరవలయు దదుపయుక్త సాధనంబుల గొని రావలయు నని చాటింపబనిచి తానుం దత్క్రియారంభ సముత్సాహ సముల్లాసిత హృదయుం డగుచు గొంతసేవు నిద్రించి యరుణోదయంబగుడు దిష్టోచి తాహారంబుగొని సౌధంబువెడలి రాజద్వారంబు సేరగా నంత నాశ్వికుం డొక హయంబున కలంకారం బొనర్చికొని రానా సైంధవంబు పాలవెల్లిదరువ నుదయించిన యుచ్చైశ్శ్రవంబో లీల భువిజరించు సప్తసప్తిసప్తియొ యాకృతిం బరంగు సమీరంబో జవనునం బిప్పగిది యరుదెంచెనో యన్నలీల సర్వాలంకార యుక్తంబగుచు మహిమయంబగు జీరాచే నొప్పి యిప్పుడమి యెంతగల దాకడలియు స్థలమయంబగు గాక యని ముందరికాల నేలద్రవ్వి కేను తెగయంజేయుచు గైజామోర లొనర్చుచు జతుఃపథంబు లంబరంబున జాచి యమరపథంబున నేగుట కుద్యమించి రేచిత వల్గితాస్కందిత ప్లుతాది భేదంబుల గమనంబు నూవుచున్న నృపాత్మజు నిఖలవాహినీ చయంబంటి వరువిడ జోనంగులు వాలంబులెత్తి మోరల ముందరికిం జాపి నేల పాదంబులు మోపకయె ధావనంబొనర్ప వేటకాం డ్రండ రొక్కుమ్మడి తోలుకుల్లాయిల నిడికొని జట్టీలపై దట్టీలు బిగించి వల లురులు కేడెంబులు బిచుపాల్బల్లెంబు లీటెకట్టియలు ధనువు విషువులు శరధులు వళికంబు లాదిగా గల సాధనంబులు గైకొని వెంట జనుదేర గానసంబున గానవిస్మృతుల జరింపుచు దమ్మటని నాదంబుల బెదరి యునుకులు వెడలి తుటుములై జనుదెంచు వన వరాహ శార్దూల భల్లూక శల్య మృగ వారంబుల దూరంబున గని తుపాకుల గురిపెట్టి జానంగి క్రా

ళృంటించి వ్రేటులెగయింప పొగతెరువున దూరివచ్చు వరాహ శా
ర్దూల స్తోమంబుల నీటుల బొడిచి యడచుచు నళికంబుల బడవైచుచు
శరంబుల స్రుక్కడగింపుచు బిచుపాల బీల్చుచు నిర్విఘ్నంబున వేట
సాగింపుచుండ నొక్క భూదారంబు భూదార దారకు నెదుట బరువిడ
నా క్రోడంబు వెంట దురంగమంబును విడిచి తరుముకొని దవ్వేగి యు
లసి సొలసి వరాహంబును గానమికి వగచి నిజపరివారంబుగానక తు
రంగంబు స[illegible] ఘోణం బాడించుచు నలయిక దెల్ప నందు కనతి
దూరంబున నొక్క కమలాకరంబు గానరా నటకుం జని యలయిక
నపనయింప నెంచి ప్రుతంబున నటకేగి తురగంబునకు నీరుద్రావించి
తా జలంబుగ్రోలి యందొక్క సాంద్రచ్ఛాయం బరగు చూత మహీ
రుహంబు చెంత విశ్రమించి దత్సరోవరంబున గనత్కనక తామర
సాంతఃప్రవిశ దళికులపాళీ సమారబ్ధగీతారవ సమాకర్ణన స్తబ్ధకణాకు
రంగీముఖ విగళిత తృణకబళ నిచిత నీలప్రస్తరరచిత సోపానాళీ ద్విగు
ణిత ద్యుతిప్రోల్ల సత్కువలయ రాజ సంశోభితంబై వళతుపతు త్రోటీ
ముఖ విదళిత బిసకాండ కబళగ్రసన పరాయణ హంసీకలస్వన రమణీ
యంబై అచ్ఛస్ఫటికాంబులక్షిత కంబుసంఘ విలసత్పయఃపూర క్షీ
రాంబుకంకాసంజాత హాసజ సితగరు దుపక్రాంత చుంకార దవాభి
రామంబై ఇందీవర బృందదృగ్వలయ వలచ్ఛ్రిమత కనీనికా వలన
వలుగుతాం జనపతీ నయన విలాస కాంతిబహుళంబై తా నరసియగు
ట సారసాశ్రయంబై విష్ణువు తెలంగున జలజాప శోభితంబై పరమేష్ఠి
కై వడి సరస్వతీ పదాభిరామంబై యొప్పి మరాళంబుల కిరవగు మా
నస కాసారంబో లేకున్న భాగీరథీ పయఃప్రవాహ వహద్బిందుసరంబో
యన దగి శైవాల కబరీధర సుందర పంకజవదన భాసురంబై కనక
బిసకాండ కాంచీవిభూషితంబై కూజిత హంసకాభిరామంబై వరవ
ర్ణినింబోలె నతిరమ్యంబగు కాసారంబు బొడగని యచ్చెరువంది య
చ్చేరువ ననేకవిధ ఖగస్వన మనోహరంబును దివ్యద్రుమ లతానిచయ
నిబిడంబగు నొక్క వనంబుగని డగ్గఱి యొందుంబ్రవేశించి యందు మల్లి
కల ననురాగ భరితంబులగు సహకారంబులును జాతుల జాతుల పెన

కువల ప్రమోదదాయకంబులగు నశోకంబులును చంపక గంధ చంద
న మలందుకొని తలయూచు పున్నాగంబులును లవంగపు దీవియలు
లవమాత్రం బెడ తెగక బెనంగియుండ నలరారు గోరంటలును నాగవ
ల్లీ సమాశ్లేషంబుల నానందంబొందు క్రముకంబులునుం గలిగి కేతకీ
ప్రసూన పరిమళమదితంబులై మధుపంబులు మధురగానం బొనర్ప
లతామందిరంబుల మలయానిలుండు గంధవహుండై నటనంబు సల్ప
వాసంతికా వాసనయనలరగంటి పూవుల సమీరా[illegible]నంబుగన న
ర్వాంగకంతంబునొంద శృంగార రసయుతంబై మరియు ఖర్జూర నారి
కేళ పనస జంబూ ద్రాక్ష లాదిగాగల రమ్యఫల రమణీయంబై మం
దార శ్రీగంధ బిల్వ కదంబాది పాదపంబుల కాపాదంబగుచు సొంపలరి
నందనంబును గ్రిందుసేయ నావైభవంబుగనుచు భూభృత్సూనుం
డందొక్క దివ్య భవనంబును గని దిట్టంబగు పారిసిలఱుంగులచే విరచి
తంబగు భిత్తులలర బటికంపు కంబంబుల నిగ్గు నిగనిగ మెరయ బవడం
పు దూలంబు లందంబులై వెలయ వైడూర్య గవాక్షజాలంబు లింపు
దనర గారుత్మంత రత్నకవాటంబు లపూర్వ కాంతిమీర గోపానసీత
లంబుల గృత్రిమ పారావత శుక శారికా ప్రకరంబుల గ్రసింప నుద్యో
గించులీల గృతక బిడాలజాలంబులు వినిశ్చలాంగంబులై యణగి విన
దంబులు గల్పింప విద్రుమ కల్పిత సోపానంబులు కలిగి వజ్రమణుల
బరవుల చంద్రికాప్రభల నిగ్గు దురంగలింప మేల్కట్టడంబులు భువికి
బఱతెంచు దివ్యవిమానంబులపగిది దోప నీచందంబున నపూర్వ రమ
ణీయత నొప్పు నయ్యాగారాభ్యంతరంబు బ్రవేశించి యందు విచిత్రతర
రచనావిశేషంబుల విస్మయావహంబై కుడ్యంబుల జిత్రితంబులగు సిద్ధ
గంధర్వ ఖేచరాంగనల స్వరూపంబు లలవడ చిత్రకల్పనాతిశయంబు
ల జెన్నుమీరు చొక్క చవికెం గాంచి క్షోణీనాథ తనూభవుండు మి
గుల నాశ్చర్య రసమగ్నుండై యారా ఇమ్యోడారువం దిట్టి కమలాక
రంబును గమలాకరోపాంతంబున కల్ప కల్పద్రుమ శోభిత వనంబును
వనాభ్యంతర విలసద్దివ్య భవనంబును భవనోదరంబున వెలయు నీ చ
వికెయుం గాంచిన నొండొంటి రామణీయత జెప్ప నలవిగాకున్నయది.

యుగాదివరకు వెదకిన సుధరణేవిజలంబు గానని యువ్విపినంబున నతి మందరంబగు దీర్ఘికయును మర్త్యలోక జాతంబులగు భూజాతంబులును నమానుష వినిర్మిత భవనోత్తమంబును నతి విచిత్ర చిత్ర రచనా విశేషంబును జూడజూడ నద్భుత రసాస్పదంబై యెన్నండును యివ్వనంబున బొడగానని యెవ్వరిచే దెల్పబడని యిమ్మహాశిల్పనా చాతుర్యం బెవ్వరిచే నైన నొక్క యనేక హాయనంబులకుగాని నిర్మింపబడజాలనట్టి శిల్పంబు కతిపయదినంబులలో నెట్లయ్యె నివ్వినోదంబు గన్న నాడు చిత్తరంగంబున చిత్రలాసకుండు నృత్తకౌశలంబు బ్రదర్శింపుచున్నవాడని నిశ్చల హృదయుండై భ్రమాన్వడియుండి కొంతవడికి మేధావంతుండై యచటి జలువరాతి తిన్నియపై గూర్చుండి విశేషంబుల గనుచుండ నయ్యెడ నొక శుకమిథునం బాకాశపథంబున నరుదెంచి వక్రదారువున వ్రాలి యెఱకల విదిలించుకొని తుండాగ్రంబున నీకెఱ నవరింపుచు జంచువు రాచికొని తోడన లేచి యచట నికటంబుననున్న దాడిమీఫలబీజంబుల నెమకి మరలం దొంటితలంబుననె వ్రాలి యలసత నొంటిపాదంబున నిలచి నిద్రింపుచు జాగ్రత్స్వప్నంబున మేల్కాని స్వజాతి స్వనంబుల నణచివైచి యందు బురుషకీరంబు శుకింగని మనుజభాషణంబుల నొయ్యలీ భూలోకంబున నీవు గన్న విచిత్రంబుల నేదైన నొక్కదానిం దెల్పి ప్రొద్దుగడపుమన్న నా కీరాంగన నిట్టూర్పు నిగుడించి స్మృతినభినయించి నాథా వినవలతేని కథలు లేకుండునే సావధానంబుగా నూకొనుము శ్లోకత్రయంబున నొక్కవిశేషంబు దెల్పెద నని బృందారక భాష నవలంబించి రచనాచాతుర్యంబమర నిబ్బంగి నుడివె,

శ్లో. రాజరాజ రాజరాజ రాజరాజ వైభవో
రాజనందనో మహార్హ నమల్లికా మనోభవో
తాపసేంద్ర యోగభావ లబ్ధభావ భవ్య గో
వాపికా సుతీరభూప్రమోద మోద మానసో.

ఈపద్యంబు జదివి యర్థంబు వివరించి యక్కీర యువతి రివ్వు న లేచి బయలువెడలి పోయి మగుడివచ్చి చెంతగూర్చున్న దావరుము కు తలిరుబోణింగని నాయకీ తేనియనాకించి విడిచిన దనివియగునే తక్కిన పద్యద్వయంబుఁ జదివి యానందం బొదవింపుమని వేడు కీరరా జంబుఁ గాంచి మనోధనా యాలింపుము.

శ్లో. కులాల భామినీ పరిగ్రహేణ లబ్ధసారసే
శాకకాండ తిక్తభావ ముక్తకాండ జన్మని
రసాల సాల కేసుజాత భామినీ విదూరితా
ఆహో మహో పరిభ్రమో న్నృపేవిధూత కౌశతే.

ఈశ్లోకంబు నుడివి తొంటివిధంబున నెగిరిపోయి మరల నేతెంచి వ్రాలియున్న కీరాంగనంగని విస్మయంబంది రాజవల్లభుం డహహా యీ యాడుచిలుక మనుష్యభాషణంబుల నుడువుపల్కు లాకర్ణింప నామనంబు మిగుల నాశ్చర్యాంబుధి మునింగి మదనుభూతవృత్తాంతం బింపు గానయ్యెడి నెద్దియో ప్రమాదవశంబున మదీయకృత్యంబుల వ్యత్యస్తం బాపాదితంబయ్యె గాబోలు, నీపద్యంబు లతిరమణీయార్థ గోచరంబులై మచ్చరితంబు స్మృతికిం దెచ్చుచున్నయది కాని యింకొక్క పద్యంబున విస్పష్టార్థంబగు, నీశుకంబు దేవమయంబై దైవప్రేరితంబుగా గానవచ్చెడిదని చింతించి యున్నతున్న నప్పురుష ద్విజంబా వెంటంగని నీ నుడువుపద్యంబు లతితనంబుల నూడ్కి యతిరసంబులై శ్రవఃపేయంబులయ్యె నింకొకపద్యంబు నుడివి యర్థంబు వివరింపుమన్న నావెంటి యిట్లుజదివె.

శ్లో. తదాముదాన్నృపాత్మజో మృగాను ధావనాదితో
వరః ప్రసాదతోయ వర్త్మపద్యరమ్య భావనః
వనంవిశ న్నిరస్తతో చరన్నిశాగతో మహా
కాంతకాంత భావకాంత కాంతిమా మహీభృతో.

ఈ శ్లోకార్థంబు వివరించి యాకీరరమణి యెగిరి పోవునవసరం బున నారాకొమరుండు విజ్ఞాతస్వోదంతుండయి వైళంబ యాశుకం బును బట్ట నుద్యోగించి పైబట్టంజుట్టి పైకెగవైచిన నందుదగిలి యొం డు బననేరకాశుకి మాయామయుంబుగాన నాపుట్టంబుతోడ నేలవ్రాలి తెత్స్వరూపంబు విడిచి దివ్యాంగనయై తొంటివిధంబున వల్లిమల్లిరూ పంబొప్పార నిలుచున్న యన్నులమిన్నంగని భూజానిజాతుం డంతరం గంబున నింతింతనరాని సంతసంబున దదీయ సౌందర్యం బుపలక్షించి యాహా యేమివింత శుకిం బట్టబోవ దివ్యసుందరియై గన్పడె నిదియిం ద్రజాలంబో మహేంద్రజాలంబో యీభామాలలామ దేవకన్యకయో సిద్ధాంగనయో, వనదేవతయో, యప్సరఃకాంతయో, తెలియకున్న యది మనుజసుందరుల కీరూపంబలవడునే దైవమాయకా దోచెడి లేకున్న నిట్టి యనూనవ సౌందర్యంబొప్పారునే జలదనికటస్థ శశిబింబంబుకైవ డి కబరీభరోపేత ముఖబింబంబమర నబ్జంబన్న సంశయంబగునని ఇం దుముఖయనందగి నయనంబు లరవిందంబులయ్యేనేని ఇందునికి సరిగా దని కువలయాక్షి యగుచు చంపకనాసయైన నక్షిమధుపంబు లిటుండ నేరవని తిలనాసయై బింబాధరియైన శుకంబు పల్లవాధరియైన పికంబు విడువజాలవని యధరబింబయగుచు కుందరదనయైన ననురాగంబు లేమి దాడిమీరదనయై శ్రీకర్ణయైన వక్రతంజేసి నవకర్ణ యనంబరగి కం బుకంఠియన్న భయనినాదంబగునని కలకంఠియనజెల్లి కమలపాణియను చో పౌరుషంబేలనని పల్లవపాణియై సింహమధ్యయగుట నిభకుచగాన ని చక్రస్తనియై నాగారు నాగంబయ్యేనేని తారుమారగునని పిపీలికా శ్రేణియయి యొప్ప నాభిజలభ్రమంబైన నయనమీనంబులు మునివడు నని నిమ్ననాభియగుచు ఏకవళియయిన జఘనభారంబున నధరకాయం బల్లలనాడునని త్రివళీయుతంబై గగనమధ్యయైన శూన్యంబగునని తను మధ్యయయి పృథ్వీనితంబయయిన తనుమధ్యకాదగదని సైకతనితంబ యగుచు రంభోరువన్న గలహంబగునని కరభోరువై మీగాళ్లదామేల న దామేలజెప్పనేలయని యనటిమొగ్గల తీరుననుకరింప జరణంబులు పంకజంబులైన దామవంకజంబులగుట తామరసంబులై నఖంబులు

రిక్కలవ విరుద్ధంబగుగాన జిక్కలసంబరగి యివ్విధంబున సర్వాంగ సౌందర్యంబమరి సకలజనానందంబగుట కువలయానందంబై సుగ్రీవ కుముదాక్ష గంధమాదన సముపేతంబగుట రామాయణంబై భారతంబు తెఱంగున కర్ణగాంగేయ కాంతిబహుళంబై భాగవతంబు భంగి ప్రహ్లాద పుండరీక ముఖభాసురంబై పరిణామరూపకోత్ప్రేక్షా భ్రాంతియుతంబగుట నలంకారశాస్త్రహితంబై ప్రత్యక్షానుమానోపమాన సంయుక్తంబుకతన దర్కసమ్మతంబై గ్రంధమయంబగుచు ముఖంబున స్వర్ణముఖియు జిహ్వయందు సరస్వతియు శీర్షభాగంబున కృష్ణయు నాభిఁద్రిపథయు నధరంబున నరుణయు శ్రవణంబున గోమతియు గల్గి తీర్థమయంబై మధ్యంబున ననంతంబును కుచంబుల వేదగిరియు వదనంబున బ్రహ్మక్షేత్రంబును కటింగాంచియు శరీరంబున శ్రీనివాసంబును గల్గి క్షేత్రమయంబై కర్పూరకాంతియుక్తంబయ్యు కర్పూరకాంతిరహితంబై చిత్రాలంకారభూషితంబయ్యు విచిత్రాలంకారహితంబై సుజనాభినందితంబయ్యు కుజనశ్లాఘితంబై రసాదృత స్వచ్ఛకాంతియుతంబయ్యు నీరసాదృతకాంతిమంతంబై యొప్పు లావణ్యంబమర సమరకామినుల యంగలావణ్యంబు భంగంబు గావించి వెలుంగునట్టి యబలామణిం గాంచి మోహావేశంబున మైమఱచి ధరాభృత్తనయుం డాతొయ్యలింగని మానినీ సర్వలోకమాననీయంబగు నీదు రూపంబు గని మానని యనురక్తి నన్యంబు మాని నాదుమానసంబు మానవతీమణి యగునిన్ను లోనూనిన యనూనరాగంబున గానగా శుకీగానపద్యవణీత భావంబుగానరా గానవిషేథంబొక్కటి నాయందు గానవయ్యె గాన నీదువృత్తంబు దెల్పుమన్న! జిరునవ్వొలయ నాకాంత యో భూకాంతతనయ కాంతతనయ తతనయ నయంబుగనను మునియనుమతిగొని చని యవనియునిచిన కతన గనని తెరగగుటగల శకరయువతి గరమనురతి బరిణయమని బరిణతిగని మదువజనిత జలజముఖపదవి వరముల ననురగతి వినరియు గనరియు ననునడవి నునుప బనిచిన వెత మెరుగని వినుమననగునే యేదీవెమల్లియ కథాయని దెల్ప రాజనందనుండు వేగిరంబ యవ్వామనయనం గౌగిలించుకొని మోహామాల

మందిరంబులకడనిల్చి మంగళహారతులొసంగి పాలకియందున్న నవపూ
ర్వ సుందరీమణి రమణీయతకు మదిమెచ్చుచు హెచ్చిన ముదంబున
జనుచుండ నొండరీ భామారత్నంబెవ్వతెయొక్కొ మర్త్యకాంతల
కీలావణ్యంబలవడునే దివ్యకామిని కాబోలు ననుకొని పోవ మఱికొంద
రీ భూమిపసూనుం డీయువ్వబలనందుబడసె నిట్టి చందంబెందుగాన మీతని
పుణ్యతపఃఫలంబని జింతింపుచు జన నాబాలగోపాల మీవిభవంబుగన
నందులగొందుల మేడల గోడల దరుల హరుల గజంబుల ధ్వజంబుల
నిలచి నిక్కినిక్కి చూచుచుండ మహావైభవంబున గపటమల్లి సాధ
బుచెంత రాజపథంబున జనుచుండ నయ్యిలాపతి తనూభవుండు సౌధా
గ్రంబుననున్న గపటమల్లింగాంచి తలయూచి యాముగరచి వెస దల
ద్రిప్పికొని ముందర పుణ్యాంగనాజనంబులు సేసలుజల్లి నివాళులొసంగ
గైకొనుచు మెల్లన రాజభవనంబుడగ్గఱి పాలకిడిగ్గి లతాలతాంగి పాణి
పంకరుహంబు నిజకరాబ్జంబునగీలించి మెల్లమెల్లన నడుగులిడుచు నెల్ల
జనంబుల కుల్లాసంబు గల్పింపుచు నిజాంతఃపురంబు సొత్తెంచి యందు
మేడపై హంసతూలికాతల్పంబున నిజసుందరీమణిం గూర్చుండ నియో
గించి గురుజనంబుల కీవృత్తాంతం బాద్యంతంబు చెప్ప వారలపరిమితా
నంద సుధాంబుధి మునింగి తేలి యిట్టి మంగళాలయయగు మంగళాంగి
బడయుట మునియనుగ్రహంబును నీసుతపఃఫలంబును కారణంబులని
జనః పుణ్యంబుగా సంశ్లాఘింప భూపతితనూభవుం డమితోత్సాహ
భరితుండగుచు నానందబాష్పం బుప్పతిల్ల జనకులచే బాణిగ్రహణ మ
హోత్సవం బురరీకృతంబుగా నప్పుడ కార్తాంతికులరావించి యొక్క
శుభవాసరంబున శుభగ్రహాన్వితంబును నిష్పంచకంబును నగు సుల
గ్నంబు సునిశ్చితంబుగావించి వారలంబనిచి షడ్రసోపేతంబులగు భక్ష్య
భోజ్యాదికంబులనింపిన పేటికలు బేటికలగొనిరావలయు నాహారవస్తు
సంతతులగైకొని లతామల్లియుం దానునుభుజించి తక్కగలవాటిని దా
సీజనంబులకొసంగి వారలంబనిచి నిశాసమయంబగుడు దదీయ సౌధాం
తర శయ్యాతలంబున సుఖశయనంబొనర్చిరంత నక్కడ గపటమల్లియు

ముఖరసంబును గని కడలేని చింతకడమై యడుగులు దడబడ నొడలు వడవడవడంక గలశమల్లియే యని మనంబున నిశ్చయించి ఘనతాపం బున ఘనతరదోలంగి చిత్తంబు కుదురుతప్పి స్వాయత్తంబుగాక నాహా రంబుపై నిచ్ఛవదలి దుర్భరచింతావేశంబున మెల్లన శయ్యాతలంబు జేరి తా జలాహారంబునకు సరోవరంబునకు బోయినది మొదలు రా జపరిగ్రహమై యిదివరకనుభూతవిషయంబుల స్మృతికిందెచ్చుకొని వ గచివగచి కుందికుంది యొగ్గియొగ్గి యేమియుబలుకక లేచు లేచినిలుచు నిలిచియూగు యూగి నిక్కి నిక్కి సిగ్గు నీల్గి యావులించు యావలిం చి తలయూచు తలయూచి చూచు చూచి చింతిల్లు నిల్లు పలుతెరం గుల చింతాగ్రస్త హృదయయగుచు భూశయ్యబవళించి నిదురరాక వేగుచుండె. అంత ప్రభాతవాతంబులు మెల్ల మెల్లన వెడలి ప్రసూన గంధంబు నలుదెసలం గలయజేసి యంగనామణుల నంగవిలేపన చందనకస్తూరికా పరిమళంబులగొని రాత్రి రతులం దేలి వేగినయల సతజనులంచు వీడని చందంబున మెల్లని నడకల గదలి రా వేగుచు క్క ప్రాచీసితంబిని ఫాలంబున నిడిన చేర్చుక్క కైవడివెలుంగ గాము దీ లతల బుష్పించిన తారకాకుసుమ నికరంబులు జల్లున రాలునట్లుడు కాంతిమాంద్యము నైంద్రీనాయకి కరంబున గురువిందంపు బంతిధరించెనన నినుం డుదయాద్రిదోప నవని భూపాలు డరుదేర గాహళిధ్వనులన దా ప్రముచూపంబుల యారవంబులు దిశలునిండ సర్వజనంబులు దమతమ వర్తనంబుల మెలంగ ప్రభాతంబయ్యె నవ్వుడా క్షితినాథపుత్రుండు కా ల్యకృత్యంబుల దీర్చుకొని కొల్వుకూటంబున కేతెంచి వందిమాగధులు కైవారంబుసేయ నిఖిలవిద్వజ్జనంబులు సకలవిధపాండిత్యంబులు సూప నట గాయక హాస్యకారు లయ్యానమయంబుల నెఱింగి వినోదింప పౌరాణిక నికరంబులు పురాణార్థంబులు వివరింప నీవిధంబున గొలు వుండి రాజతనూభవుం డంతరంగంబున గపటమల్లి కృత్రిమకార్యంబుల దలంచి దానిఖరారోహితం గావించి నామంబిడి పురంబువెలువడద్రో య నాజ్ఞనొసంగి పరిణయోద్యోగ పరాయణుండై యఖిలరాజన్య వరేణ్యులకు బత్రికల లిఖించిపంపి నిజపురాలంకారం బొనర్ప జాట

బనిచి యపూర్వవస్తు వితతుల రావింప రాయసుల నియోగించి స్వ పాలు డంతఃపురంబునకు జనియె నావిధంబున నయ్యానియోగకారులు న్వనియుక్త కార్యనిర్వాహ ధౌరంధర్యంబును వహింప బౌరజనం బు లుత్సాహంబున మెలంగ బట్టణాలంకార నియుక్తజనంబు లందం దు కాయమానంబుల జిత్రమానంబుల నొనర్చి యందు జిత్రవస్త్రా లంకారంబుల రంజనంబొప్పగావించి రాజమార్గంబుల నిరువంకల నెడనెడ దీపశ్రేణీవహంబులగు కంబంబులమర బ్రాసాద నివహంబుల కేతనంబులొప్ప నందందు పచ్చతోరణంబులుగట్టి కాయమాన మ ధ్యమంబుల గీలుబొమ్మలగావించి తత్కూటాగ్రంబుల బన్నీటి బుడ్లమర్చి పన్నీటికాలువ లందందు వెలయ దివ్యకుసుమమాలికా ప్రకరంబుల బందిలులమర్చి నానాదేశాగత గజతురంగమ స్యందనంబుల శాలాన మందురాదిశాలలగ్గిసేసి జనపదాగత జనపతుల కందందు విడుదల న లంకరించి చిత్రసాలభంజికల కోటల బేటల మేడల గోడల విచిత్రత రంబుగా నమర్చి చిత్రశాల లతివిచిత్రంబులై యంత్రమయప్రతిమా శ్రేణుల నద్భుతరసాశ్రయంబుగా నేర్పరచి యన్యద్వీపంబులందుండి యనన్యసామాన్య లభ్యంబులగు వస్తుసామగ్రులం దెప్పించి మరియు భక్తశాలలు భోజననిలయంబులు విలాసభవనంబులు శయనాగారంబు లు నలంకార మందిరంబులు యందంబులుగా నమర్చి నగరీవాస్తవ్య జనసదనంబుల నలంకారంబొనర్ప నియోగించి సర్వాలంకార మహితం బగు నానగరియు భోగవతియుంబోలె విలాసంబుచే నొప్పి నరనాథ సుతునకుం బట్టమహిషియగుదునని యాభోగవతిం బరిహసింపుచు జ లనిధిం బ్రతిబింబితంబగు నమరావతి వడువుననొప్పి రంభా మేనకాలం కృతయగుచు నలకాపురివైఖరి పద్మ కుముద కుందాభిరామ యగుచు నప్పురీరమణి మరియు సుధామయ చంద్రికాసమన్వితంబుగాన చంద్రా లోకంబును గవిసముదయ నిలయమగుట గవిజనాశ్రయంబును రసవ న్మణి రంజితంబుగాన రసరత్నాకరంబును ననుకరించి యలంకార శా స్త్రసమ్మతంబై యఖిలజననయన చంచరీకనిచయంబునకు రాజీవంబు పోల్కి వెలుంగుచుండ నంత నుద్వాహమహోత్సవ సమ్భాషణ

సముపజాతకుతుక విలసన్మానసులగు మానవనాథులు ద్యుతిమన్మహీనాథు డాశ్చర్యకరంబగు లతాభామ పరిణయంబగుట మిగులవిచిత్రంబని త్వరమాణస్వాంతులగుచు దమతమ గజ హయ రథ పదాతివర్గంబులతో సరుదేర వారలమల్య సైంధవ మాతంగ స్యందన భట నివహంబుల ననుర్గొని లాస్య గాన వాద్యవిశేషంబుల దోడ్కొనివచ్చి విడుదులడించి తదీయమంత్రి భృత్యసైనికాది నివహంబులకెల్ల వలయు నాహారాదిక పదార్థజాలంబెల్ల నపరిమితంబుగానమర్చి యెవరెవరెంతెంతవారలో యంతంతవారల కంతంతవారలై నిజామాత్యభృత్యసైనికవర్గంబులు దగుమర్యాదల ననుసరింప నానాదిక్సమాగత కవి బుధ పండిత విద్వద్బ్రాహ్మణ జనంబులు నేలయీనిన చందంబున బుడమినుదయించు నుసిళ్ళభంగి పట్టణంబుసేర నెడములేక క్రిక్కిరిసి జనంబులచే ద్రోపులాడ మాడుచుండ నవ్వారవంబు సాగరంబురీతి ఘోషచేయఁగ నెందుగన్గొన్న హయహేషారావంబులు గజబృంహితంబులు రథనేమిస్వనంబులు జయఘోషంబులు భేరీనాదంబులు మురజధ్వానంబులు గాహళారావంబులు నొండొంటిఁగలసి దిక్కృతంబులై నింగిముట్టి దివి యమరవర్గంబు భువినద్భుత లతాసుందరీపరిణయంబగునని యంబరంబున వాద్యవిశేషంబుల నొనరించిన విధంబున సకలధ్వను లాకసంబున ప్రతిధ్వనులనీన నంత పరిణయవాసరంబున సకలరాజన్యవరేణ్యులు గల్యాణ మహోత్సవ దిదృక్షాసముల్లాసిత హృదయులై తత్తదుచిత మణిఖచితపీఠంబుల గల్యాణమందిరంబు సేర్పించి విడుదులువెడలి స్వస్వవాహారూఢులై చనుదెంచి తమతమ పీఠంబుల నధిరోహించి కూర్చుని వివాహమందిర వైభవంబునుగని యద్భుతరసంబావిర్భవింప నహహా యియ్యది విశ్వకర్మనిర్మితంబో మయమాయానిర్మితంబో కావలయు గనత్కనక స్తంభాగ్రప్రత్యుప్త రత్నప్రభావళులూర్ధ్వముఖంబున వ్యాపించి సజలజలదవ్యాప్త శతమఖధనువుపోల్కి దీపింప నధఃప్రసరణంబున స్వర్ణకదళ విరాజదింద్రనీల సోపాన రచిత కాసారడంబంబు విడంబింప దిశల నినశశిప్రభలదగడ నపూర్వవిశ్వ

కాంతిరంజితంబై జననివహమ్ముల కన్నుదమ్ములకు సంకోచవికాసంబు
లొదవింప నీవైభవంబుగనుచు సముత్సాహిత మనస్కులై యుండ
లగ్నంబాసన్నంబగుడు త్వరమాణహృదయులై గురుజనంబులు బంధు
జనంబులెల్ల రన్నిదిశలం బరువిడుచు వలయు మంగళద్రవ్యంబుల మణి
ఖచితంబులగు పళ్లెరంబులగొని తెచ్చి కల్యాణవేదిపై నునుప నంతకు
మున్న మంగళస్నానంబులాచరించి యమూల్యవస్త్రాభరణంబుల ధరిం
చి లగ్ననిరీక్షణంబు సేయు మల్లీరాజనందనుల చెంతకు గురుజనంబు
లతోడ గరంబున గనక కలశంబుగొని సాక్షతపుష్పమాలికా హస్తుం
డై మంత్రపూర్వకంబుగా సమయోచితకృత్యం బొనర్పుచు బురోధనుం
డరుదెంచి మహారాజాధిరాజ బిరుదాంకిత దిఙ్మాండల దిఙ్మండలవిలసత్కీ
ర్తిలతా ప్రసూన పరిమళమిళద్భ్రమరాంగనా సంగీతగీతగీతప్రభావాప్ర
భావవిజిత శత్రురాజన్య కిరీటస్థగిత మణిరంజితచరణ మహాప్రభో వివా
హలగ్నం బాసన్నంబయ్యె గల్యాణభవనంబున కరుదేరవలయునని వి
న్నవింప రాజసూనుండు కలశమల్లీవదనంబుగాంచి లెమ్మని సంకేతం
బొనర్ప లతామల్లియు నుల్లాసం బుల్లసిల్ల చివాలున లేచి నాధుని కర్ణాం
తికంబున మెల్లన రాజచంద్రమా యేను తపస్సంభవ యగుటం జేసి
నామహిమం బెల్లరకుం గాన్పించెద నద్భుతరసంబు గల్పించెద నీపేటిక
యందంతర్హితనై యుండెద నీపేటికం గొనిచని కల్యాణపీఠిపై నునిచి
మాంగల్యధారణంబునకు ముందు యీపేటికందీయుము వెంటనే నా
స్వరూపంబున నీకరగ్రహణంబు జేసి నీచెంతనిలుచుండెద నప్పుడు యు
ఘాన్యాయంబున మాంగల్యధారణం బొనర్పుమని నవరత్నఖచితంబగు
నపరంజిపేటిక యందివ్వ బుచ్చుకొని భూపాలసూనుండు మహదానం
దంబున ముందర కంచుకులెచ్చరికలుదెల్ప గురుబంధు పౌరోహిత
వర్గంబు లాశీర్వదించుచు దోడరాగ కల్యాణ భవనంబుసాత్తెంచి మణిపే
టిక గల్యాణపీఠిపై నునిచి వేదమంత్రఘోషంబుల భూసురోక్తవిధానం
బు లాచరింప మంగళరత్నఖచిత పీఠంబున గూర్చుండి భేరీకాహళము
రజనిస్సాణ మంగళవాద్యధ్వనులు కర్ణవివరంబుల నిరోధింప వందిమా
గధవైతాళికు లయ్యానమయంబు లెఱింగి కైవారంబులుసేయ నానా

దేశాగత ధరణీధవపుంగవు లమితోత్సాహంబున వీక్షింప నగ్రజన్మా శ్రిత మంత్రానుష్ఠానంబు లాచరింపుచుండ నెల్లజనంబులు దీనిమల్లి యె యెట్లుండునో చూతమని జనవారంబుల దొక్కరొక్కరి వీపులపై భుజంబులపై గటిపై నెక్కినిక్కి చూచియు గానంబడమి కంబంబుల ప్రా యంతరంబుల నిలచియుండ మరికొందరు సౌధాగ్రంబులెక్కి పందిళ్ళ లనందులోనర్చి వీక్షింపుచుండ మాంగల్యధారణ ముహూర్తంబు సమీపింప యెల్లరులు తెప్పలల్లార్పక చూచుచుండ భూనాథ తనూభ వుండు వల్లీమల్లిం దలంచుకొని స్వర్ణపేటిక దెఱచిన మాత్రంబున కోటిసూర్య ప్రభ లుట్టిపడ్డగతి నవరత్నంబులు పైకెగచల్లిన రీతి చంద్రికాపరంపరలు గుప్పున లేచిన విధంబున గనకకాంతులు వెదజల్లిన శేవ విద్యుల్లతలు గుంపులై వచ్చిన చందంబున నత్యద్భుత కరంబగు దేహ ప్రభలం గాంచి సర్వజనంబులు నిశ్చేష్టితులై నానంబున శ్వాసంబాడక చిత్రంపుబొమ్మల వలె నిలుచుండియు గూర్చుండియు వంగియు తొంగియు కంబంబులెక్కియు వీపులెక్కియు నున్నట్టిజనంబు లయ్యాచందంబున విభ్రాంతులై దిగ్భ్రమనొంది కొంత సేపునకు దెలివొంది చూడ సర్వాంగ సౌందర్యం బొప్ప హరిప్రియయో హరపత్నియో విరించిసతియో గంధర్వకాంతయో నాగభామినియో ఖచరాంగనయో సిద్ధయువతియో సాధ్యసుందరియో గరుడగజగమనయో యన్నలీల లీలావిలాసాంగియై వెలుంగు సుందరీమణింగని యొకళ్లోకళ్లు యేమియుంబలుక నోరాడక స్తబ్ధస్వాంతులై యిక్కన్య దేవభామినియో మనుజకాంతయైన నిట్టియనన్య సౌందర్యంబలవడునే యని చూచుచుండ రాజరాజవిభవుండగు రాజనందనుండు కడలేని సంతోషవారిధి మునింగి తేలి మంత్రవాద్య మంగళఘోషంబు లంబరంబున మ్రోయుచుండ మాంగల్యధారణంబుగావించె. అంత సంతసంబున సకలగురుజనంబులు దీవింప బ్రాహ్మణజనంబు లాదంపతుల కాశీర్వచః పరంపరల బరగింపుచు శ్రీమన్మహారాజాధిరాజ ప్రతాపవిజిత దిఙ్మండల స్థరాజన్యవశేణ్య కిరీటస్థగిత మణికిరణ రంజిత చరణయుగళస్య కాంతిమతీగర్భశుక్తి సంజాత స్థూలముక్తామణేః జ్యోతిష్మన్మహీధవ తపస్తరు సముద్భూత స్వాదు

ఫలాయితస్య వల్లీమల్లీ నితంబినీ పాణిగ్రహణ సముద్భవ హర్షాంబుధి సంజాత శాకాశశాంకాయిత మానసస్య ద్యుతిమన్నామధేయస్య రాజరాజవిభవస్య భూయాంసి శ్రేయాంసి భూయాసురితి భవంతో మహాంతోను గృహ్ణంతు తథాస్తు అనయోర్దంపత్యో రితోధిక రాజ్యభోగ గజతురగ స్యందనాదిక సకల సంపత్సమృద్ధిర స్త్వితి భవంతో మహాంతోను గృహ్ణంతు తథాస్తు అనయోర్దంపత్యో రధికతరకాంత్యౌదార్యగాంభీర్య ధైర్య నయవినయాదిక గుణగణ సంపదుల్లాసాః భవంత్వితి భవంతో మహాంతోను గృహ్ణంతు తథాస్తు అనయోర్దంపత్యో దీర్ఘాయుష్యమ స్త్వితి భవంతో మహాంతోను గృహ్ణంతు తథాస్తు అస్యరాజ్ఞః ప్రజానురాగోస్తు తథాస్తు. సకలకల్యాణ గుణాభవంతు తథాస్తు స్వస్త్యస్తుతథాస్తు.

ఈ తెరంగున భూదేవులాశీర్వదించి మంత్రాక్షతలొసంగ మల్లీ సహితంబుగా నక్షతలంగొని వందనంబొనరించి నిఖలభూనాయకుల కెల్ల తత్తదుచితప్రకారంబుల దాంబూలంబు లొసంగి విప్రతండంబుల తత్తదనుగుణ సంభావనాగౌరవంబుల దృప్తిగావించి యెల్లజనంబుల భోజనంబునకనిపి తానుతామల్లీ కరాబ్జంబువట్టి తోడ్కొని యంతఃపురంబునకుం జనియె నంతముఖభుజోరు పాదజాత జాతిజాతంబెల్ల దత్తచ్ఛాలలకరిగి యుండౌదనికులతి నైపుణ్యంబున పాకాగమ ప్రకారంబుల నలభీమవిరచిత మార్గంబునధిగమించి పక్వపరిణతి నభినవ సూదవిద్యా విచక్షణత్వంబున శాల్యన్న పాయసాన్న చిత్రాన్న దధ్యన్న నారికేళాన్నాదిక నన్న విశేషంబులనొప్పి ఘృతపక్వంబులును సూపనిచితంబులగు శాకసమూహంబులు ఘ్రాణేంద్రియ తృప్తికరంబులగు పరిమళంబుల శిరఃకంపంబలవడజేయు చోష్యపానీయాదిక రసవర్గంబులను దేమనంబులుం బచ్చళ్లూరుగాయ లాదిగా వ్యంజనపదార్థంబులొప్ప మరియు నానావిధభక్ష్యాదికంబులును లేహ్యభక్ష్యంబులు ననువుపై రసనాగ్ర నర్తకమగు సూదవిద్యా చాతుర్యంబమర సర్వజనంబులు బరితృప్తభుక్తులై చందనపుష్ప తాంబూలాదికంబుల రంజితహృదయు

లై యంకందు బాళవిశేషంబుల నాకెల్లోకల్లు బ్రసంగింపుచు భూ యానంబున బడిపారలిలేచి సర్వజనంబులు సర్వాలంకారంబు లలవరిం చుకొని రాజభవనంబు సేర నిశాసమయంబుదోప నీభూపాలసుతుండు ద్యుతిమంతుండగుట దమంబున కెడములేమి రథ్యానిక్షిప్త దీపనివ హంబులు దారకా నికరంబుమాడ్కి దేజరిల్ల భవనకాంతులెల్లెడబర్వ రాత్రిందివంబుల కైకమత్యం బాపాదింప నందుగన్న జ్యోతిర్మయం బయి ప్రాగ్జ్యోతిషంబను నామంబన్వర్థంబుగా వెలుంగ నంతబాలకి న ఖిలశృంగారం బొనర్చి పుష్పమాలిక లుల్లసిల్ల మహోద్యుతులు మిణు మిణ్ణుగొల్ప నసంఖ్యాతజరదీపికా సహస్రంబులు వెలుంగ నందా దంప తు లక్షరోహితులై సకలవిధనృత్తగీత వాద్యంబులు భోరుకొల్ప శిరక లాఘుకీణులచే నతివిచిత్రతర కల్పనాతిశయంబుల గల్పితంబులగు విద్యా వినోదంబులు గల్పలతికలభంగి పుష్పితద్రుమంబులమాడ్కి కుంజంబు లవదువ్వున చంచలల చందంబున తారంగికులచక్కి నవనీతంపు ఘుటి కల విధంబున దీవియలభాతి ననేకవిధ స్వరూపంబుల జూద్కుల నప హరింపుచుండ సర్వజనంబులు బరాబరులై యిరుగెలంకుల జనుదేర బార స్త్రీణంబందందు మంగళహారతులంబాడి హారతులొసంగ మ హేంద్రవయిభవంబున నిఖిలభటసైనిక బృందంబు లనువై నయవిన యంబుల సేవింప రాజపథంబున బురప్రదక్షిణంబుగావించి భవనంబు సొత్తెంచి పన్నీటికాలువల జలువనొసంగు భవనాభ్యంతరంబున వెల యు పూలకొట్టంబున షోలారోహితులై నృత్తగీతవిద్యా వినోదంబుల నుండులేటి నాడు వనమధ్యంబున నుపలంబు లభిమంత్రించి యిచ్చి రా జపుత్రి ననుగ్రహించిన బడుగులరాయ శాస్త్రియు యోగవిద్యామహి మంబున వల్లీపరిణయంబెఱింగి సంతసంబుప్పొంగ తనదు తపోబలంబు పరిణతంబయ్యెనని యోగవిమానంబెక్కి యంబరపథంబున నటకరుదే ర నెల్లజనం బవ్విధం బుపలక్షించి యాశ్చర్య రసనిమగ్నంబై దివినుం డి భువికరుదెంచు సకలకళావన్మండలంబో యభినవోదిత పతంగ బిం బంబో ప్రాజాపత్య స్వరూపంబో యనదగి సమీపగతంబుగా నవయ వవిశిష్ట చేతనంబుగా దోచిన విరించియు దేవర్షియగు నారదుండో

పర్వతమహామునిరాయ నగస్త్యుండా యున్నభాగున వితర్కహితంబగు
చు నవ్విమానంబు నేలవ్రాల నందు విద్రుమలతల చాడ్పున జడలొప్ప
నిన బింబంబువై ఖరి ముఖంబుదనరి శీతాంశు కరంబులీల కాయకాం
తులలర నిజతేజస్స్థిర స్కృతాన్య తేజస్కుండై వెలుంగు తపోధనుం
గని నయ భయ వినయ భక్తిభావనా విశేషంబుల నభివందనంబు
గావించి యంజలీ బద్ధంబగుచు నిలువ రాజనందను డతిరయంబున దిగ్గు
న లేచి జాయాసహితుండై ప్రదక్షిణం బాచరించి భయభక్తి వినయ
వినమితోత్తమాంగుండై పునః పునః ప్రణామంబు లొనరించి నిలు
చున్న నమ్మిథునంబుగని తాపస వరేణ్యుం డుత్సాహ భరితుండగుచు
నో బాలక బాలకత్వంబున గోరిన వరాంగన యిదియె కదా యిదియె
కదా యమృతాంగి యమృతాంగంబుల నెల్లగుల మోహింపజేయు న
గుకయీయమయె యీయము యమోఘసంకల్పంబున నిఖిలంబు జని
యించు లీలావతి లీలలెల్ల జగదుదయ వికాస విలయంబు లీలీలలెరిం
గిన యోగిజన హృత్పుండరీకంబుల నవలీలజరించు దృగ్ద్రశ్యంబుల
శైక్యంబు గావించి యుభయగోచరయై యున్నటియెసంగు యెరుక ఈ
లతాసుందరియె నాదబిందుకళాస్వరూపిణియై యాధారాది కమల
షట్కంబుల విహరించి శ్రుత్యనుభవ గోచరయై మెలంగు వెలంది
యీభాగ్యవతియె యిట్టిమంగళాంగి నిన్నువరించుటం జేసి నీవు ధన్యుం
డవు మాన్యుండవీవు తొంటి జన్మంబున దపం బాచరించి పరమేష్ఠినా
రాధించిన విరించియు బ్రసన్నుండై వరంబు వేడుమనిన పరమేశ్వరివంటి
మహిమంబులుగల వరాంగన బరిణయంబగునట్లు యనుగ్రహింపు మ
న్న నట్లయగుంగాక యని పితామహుండు జనియె. నదికారణంబుగా
నీవుట్టువున రాజనందనుండవై యన్నిమిత్తంబునం జేసి త్రిగుణంబులను
ఫలంబులొనర్చి యిప్పు డప్పరిభావాతిశయంబున వల్లిమ్నం బడసితివి
య్యాబలయం దనూనరాగంబున సంతానంబు వడసి ధర్మార్థ కామమో
క్షంబుల నెడి యైహికాముష్మిక సంపదల ననుభవింపుమని యాశీర్వ
దించి మునివరుండెల్లరు జూచుచుండ యోగవిమానంబెక్కి నిజేచ్ఛం
జనియె నంత సకలజనౌఘం బత్యంత యద్భుతరసం బనుభవించి భక్తి

పారవశ్యంబున నైమరచి నిశ్చేష్టితంబై యుండ నపాత్మజాం డిదియది యని నెఱుంగరాని యానందంబునుం జెంది యంతపరిణయాగత సర్వోర్వీరమణుల నయ్యావిధంబుల నమూల్యచీని చీనాంబరాదిక వస్త్రభూషణాదుల సన్మానంబుగావించి యెల్లజనంబుల కయ్యాప్రకారంబుల బహుమతులొసంగి యారికప్పణలొసంగి యనిపి పల్లీమల్లీ సహితుండై నిజాంతః పురంబునకుం జనియె. అంత ప్రభాతంబగుడు సర్వజనంబులు స్వీయ నగరాభిముఖులై చన రాజనియోగకారు లాకపటమల్లి సౌధంబున కరిగి రాజాజ్ఞ నెఱుంగింప జైతన్య రహితంబైన ప్రతిమయుం బోలె నిర్వీర్యయగు కుటిలాశయంబట్టి ఖరారోహణంబొనర్చి యర్ధచంద్రహారంబుల నలంకరించి పురివెడలం ద్రోచిరంత నాభూకాంతుండా దేవి పల్లియుం గూడి సకలవిధసౌఖ్యంబు లనుభవింపుచు రాజ్యోపభోగాదుల సుఖంబుండె నీపల్లీమల్లీ మాహాత్మ్యంబును భక్తి విన్నజనివిన మానవులెల్ల గొల్లలుగ నిహపరసుఖంబు లనుభవింతురని సుజనస్తోమంబు వినుతింప శ్రీకరంబై వెలయుగాత.

శ్లో. మంగళాంగతనూసంగ రంగదాత్మమహాహ్లాదయః
భవమాభవరూపీ యస్సపాతు జగత్ప్రభుః.

శ్లో. లీలావిలాస సుభగా శ్రుతిపంజర మధ్యగా
కరోతు దేవీ భద్రంనో కామితార్థ ప్రదాయినీ.

ఇది శ్రీమత్త్రిపురసుందరీ కరుణాకటాక్ష వీక్షణోపలబ్ధ వాగ్వైభవ శ్రీలక్ష్మీనృసింహ శ్రీ శ్రీనివాస గురువరాపాంగ వీక్షాసముపాత్త విద్యావిశారద మేడేపల్లి వంశ సుధాపయోధిరాకాశశాంకాయమాన సుబ్బాశాస్త్రి పౌత్ర వేంకటసుబ్బయామాత్య పుత్ర సకల బుధజనవిధేయ వేంకటసుబ్బరాయ శాస్త్రి ప్రణీతంబైన మల్లీ మాహాత్మ్యంబను వచన కావ్యంబునందు ద్వితీయోల్లాసము.

సంపూర్ణము.

# కలాకల్పవల్లీ గ్రంథమాల.

1. ఇందు సంవత్సరమునకు నాలుగు గ్రంథములవంతున ప్రకటింపఁబడును. ఒక నాటకము, ఒకనవల, ఒక విమర్శనగ్రంథము, ఒక ప్రాచీనపద్య ప్రబంధము. ఇట్లు ఒక్కొక్కటిగ మూఁడుమూఁడు మాసముల కొకటివంతున ప్రకటించుచు నప్పుడప్పుడు పాఠకుల తృప్త్యర్థము పారితోషికములను గూడ నేర్పాటుచేయఁబడును.

2. చందాదారులు సంవత్సరమునకు రూ. 4—0—0 లకన్నను మించిన మొత్తమును చెల్లించ నక్కర లేదు. అదియును ఏగ్రంథము వెలకు ఆగ్రంథము వి. పి చేయఁబడును. మొత్త మొకసారి చెల్లింప నక్కర లేదు.

3. ఈగ్రంథమాలయందు వెలువడు గ్రంథములన్నియును కొను వారే శాశ్వత చందాదారులు. చందాదారులు కానివారికి గ్రంథము వెల రూ. 1—0—0 కి 0—4—0 లు అధికమగును.

4. వి పి పోస్టు ఖర్చులను మాత్రము చందాదారులే భరించుకొనవలయును. ప్యాకింగు మొదలగు ఖర్చులు చందాదారు లివ్వ నక్కర లేదు.

5. మహారాజపోషకులు వారి దయాధీన మొసంగ గలరు.

6. ప్రధానపోషకులు వత్సరమునకు రూ. 20—0—0 లు మాత్రము.

7. పోషకులు 10—0—0 లును సహాయకులు రూ. 5-0-0 నొసంగ వలయును.

8. చందాదారులు ప్రవేశరుసుము మొదటిగ్రంథముతో చేర్చి 0—4—0 లొసంగవలయును.

9. పదిమంది చందాదారులను జేర్చి పంపినవారికి మాగ్రంథమాలాగ్రంథములన్నియు నుచితముగ నొసఁగబడును. గ్రంథము లక్కర లేనియెడల రూ. 100—0—0 కి 15 రూపాయలవంతున కమీష నివ్వఁబడును.

ప్రథమ కుసుమము.

# అనురూప.

ఇది శ్రీమాన్ బాలకలానిధి. డి. శేషాచార్యులవారిచే నీతిబోధకముగ రచింపఁబడిన అయిదంకముల నాటకము. ఇందు రత్నవర్మకష్టములు, రూపణికయను వేశ్య మాయోపాయములు, అనురూప పాతివ్రత్యము, చెలికత్తెల నేర్పరితనమును చూచినగాని తెలియఁజాలదు. అనేక నాటక రంగముల యందు ప్రదర్శించి పారితోషికములందిన నాటకరాజము. చందాదారులకు రూ. 0—8—0

ఇతరులకు 0—12—0

ద్వితీయ కుసుమము.

# వల్లిమల్లి.

ఇది అపూర్వమగు అద్భుత ప్లాటుగల చిన్న నవల. బ్రహ్మశ్రీ యం. సుబ్బరాయశాస్త్రి విరచితము. మిగులచమత్కారముగు గంభీరశైలి గలది. చందాదారులకు 0—4—0 ఇతరులకు 0—6—0

తృతీయ కుసుమము.

# పాండవకాల నిర్ణయము.

ఇదిపాండవులయొక్క ప్రతికార్యమును చరించినదినములును శ్రీమహాభారత వచనానుసారము యుక్తియుక్తముగ విపులముగ విమర్శింపబడి వారికాలమును విశదీకరించి యున్నది. శ్రీమాన్, వాడపల్లి కృష్ణమాచార్యులవారు రచించిరి. అందందు భారతములోని అపూర్వ చారిత్రిక విషయములెల్లను జాగ్రతతో పరిశీలించి వ్రాసిన సత్యమగు విమర్శనగ్రంథము. ఇట్టి యపూర్వగ్రంథ మిదివరకు ఆంధ్రభాషయందు వెలువడి యుండలేదు. చందాదారులకు 0—8—0

ఇతరులకు 0—12—0

మానేజరు:— కలాకల్పవల్లి.

తాగాపారిపాళెము, సత్యవేడుపోష్టు; చెంగిల్పట్టు జిల్లా.

